**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>Ist of each calender month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B.VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B.NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA(Minor)<br>(Minor admitted to the benefits of Partnership)<br><br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1991*

ఎందుకు అతను పైన వున్నాడు

అంతా ప్యారీస్ మిఠాయి కోసమే




ఈ మిఠాయిల మీద వున్న ఇష్టం పోనే పోదు

HTA 7713 A

# మిఠాయిలు ఎమిటి?

ఈ చిత్రంలో 11 ప్యారీస్ మిఠాయిలు దాక్కున్నాయి.
వాటిని అన్నిటినీ కనిపెట్టగలరా?




మిఠాయిలు కాఫీ బైట్, క్యారమిల్క్, ట్రై-మీ, లాక్టో కింగ్, ఎలైచా, మూన్ డ్రాప్, టాంగో, చాకొలెట్ ఎక్లెయిర్స్, కోకోనట్ క్రీమ్, చాకోటాఫ్ మరియు పిక్నీస్.

## చేసిచూడండి

ఒక కప్పు మైదా, $^{1}/_{4}$ కప్పు ఉప్పు, $^{1}/_{3}$ కప్పు నీళ్లు. ఒక గిన్నెలో కర్ర గరిటెతో బాగా కలవండి [చిత్రం 1]




మైదా ముద్దని వేళ్ళతో ఒత్తి ఉండలుగా చేయండి [చిత్రం 2] నీళ్లు, పిండి ఏదయినా తక్కువయితే అది కలవండి. ఇప్పుడు మీరు అనుకున్న పిల్లి, కుక్క బొమ్మలని ఈ పిండితో చేయండి. ఎన్నో రకాలవి చేయవచ్చు. ఆ పిండి ముద్దని ఎన్నో రోజులు వుంచాలనుకుంటే, ప్లాస్టిక్ బ్యాగ్‌లో వుంచి ఫ్రిడ్జిలో పెట్టండి. [చిత్రం 3]. మళ్ళీ దానిని వుపయోగించాలనుకున్నప్పుడు బయటకు తీసి కొంతసేపు అలా వుంచండి.




## తెప్ప చేద్దామా

ఇది చేయడానికి మీకు కావలసినవి: రంగుల అట్ట, కత్తెర, వాల్‌నట్ (అక్రోటు) పెంకు, కూల్‌డ్రింక్ స్ట్రాలేక చిన్న పుల్ల, తెల్ల కాగితం, జిగురు లేక ఫీవికాల్ మరియు పైన చెప్పిన మైదా పిండి ముద్ద.

మీరు చేయవలసినది:

1. తెప్ప చేయడానికి దీర్ఘచతురస్రాకారపు చిన్న అట్టముక్కకి నాలుగు వాల్ నట్ పెంకులని అతికించండి. [చిత్రం 1]







2. ఒక చిన్న తెల్లకాగితం నుంచి తెరచాప కత్తిరించండి.
3. కూల్ డ్రింక్ స్ట్రా లేక పుల్లని పిండి ముద్ద లోంచి గుచ్చండి. [చిత్రం 2 ]
4. కూల్ డ్రింక్ స్ట్రాని చిన్న పిండి ముద్ద ఉండతో పడవకి చేర్చండి. [చిత్రం 3 ] ఇప్పుడు స్నానం తొట్టిలో కాని, మడుగులో కాని తెప్పని ఒదిలి పెట్టండి. అది తేలుతూ వెళ్తుంది.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## యుద్ధం: నాడు—నేడు

అతి ప్రాచీనకాలం నుంచి అనేక యుద్ధాలు జరిగినట్టు మానవ చరిత్ర చెబుతున్నది. అయితే, అనాడు జరిగిన యుద్ధాలకూ ఈనాటి యుద్ధాలకూ చాలా తేడా ఉన్నది. పూర్వం ఇరుపక్షాల మధ్య యుద్ధం జరిగినట్టయితే—ఒక పక్షం విజయం సాధిస్తే మరొక పక్షం పరాజయం పాలయ్యేది. యుద్ధపర్యవసానాలు కూడా ఇరుపక్షాలకు మాత్రమే పరిమితమయ్యేవి. అయితే, ఇప్పుడు జయాపజయాల మాట ఎలా ఉన్నప్పటికీ యుద్ధ పర్యవసానాలు మాత్రం యావత్ ప్రపంచాన్ని దారుణంగా ప్రభావితం చేస్తాయి. ముఖ్యంగా యుద్ధంలో ప్రయోగించే మారణాయుధాలూ, అనుసరించే వ్యూహాలూ, అచరించే పద్ధతులూ—గాలినీ, నీరునూ కలుషితం చేసి భూమిని మానవ నివాసయోగ్యం కాకుండా మారుస్తాయి. మనిషి చేసే ఈ దారుణ కృత్యాలవల్ల పశుపక్ష్యాదులు సైతం సమూలంగా నాశనమవుతాయి.

అటువంటి భీకరయుద్ధం ఇప్పుడు పర్షియన్ సింధుశాఖలో జరుగుతున్నది. మానవత్వాన్ని మంటగలిపే ఇటువంటి ఘటనలు మునుముందు మానవచరిత్రలో పునరావృతం కాకూడదని ఆశిద్దాం!

సంపుటి 88 | మార్చి '91 | సంచిక 3

విడి ప్రతి : 3-00 | సంవత్సర చందా : 36-00






ఉద్రూతలూగించే నవ చైతన్యంతో ఆనందించండి...

# ఆహా! టర్బో

క్రొత్తది!




మీ అంతట మీరే కొత్త క్యాంప్కో టర్బో తీసుకోండి. మీగడతో నిండిన మిల్క్ చాక్లెట్‌తో చుట్టివున్న శక్తిదాయక బార్. ఉరకలు వేసే నూతనోత్సాహాన్ని అనుభవించండి. నవయువ చైతన్యాన్ని పొంగి పొరలనీండి. క్యాంప్కో అనండి. టర్బో కోసం కదలండి.

—శక్తిదాయక చాక్లెట్




భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు.

R K SWAMY/CL/8351/TEL



# ఇజ్రాయెల్‌పై దాడి ఎందుకు?

ఇరాక్, పొరుగుదేశమైన కువైట్‌ను ఆక్రమించుకోవడంవల్ల, సింధుశాఖలో యుద్ధం ప్రారంభమయింది. కువైట్ నుంచి, ఇరాక్‌ను వైదొలగమని ఐక్యరాజ్యసమితి మొదట కోరింది; గడువిచ్చింది; హెచ్చరించింది. అయినా, ఇరాక్ అందుకు అంగీకరించలేదు. తత్ఫలితంగా, మిత్రపక్షాల సేనలు అమెరికా నాయకత్వంలో, ఇరాక్ మీద యుద్ధం ప్రకటించడం అనివార్యమయింది.

యుద్ధం ప్రారంభమయిన వెంటనే, ఇరాక్ ఒక వైపున అమెరికా మిత్రపక్షాలతో పోరాడుతూనే మరో వైపున ఇజ్రాయెల్ మీద క్షిపణుల దాడి ప్రారంభించింది. ఇంతకూ ఇజ్రాయెల్, ఇరాక్‌కు వ్యతిరేకంగా తన సేనలను పంపనూ లేదు. అయినప్పటికీ ఇరాక్ ఎందుకిలా చేస్తున్నది?

ఇజ్రాయెల్ యూదుల రాజ్యం. అయినా, యూదులు వందలాది సంవత్సరాలు తమ మాతృదేశమైన ఇజ్రాయెల్‌కు దూరంగా గడపవలసి వచ్చింది. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో, యూదుల స్థితి మరీ భయానకంగా తయారయింది. హిట్లర్ ఆజ్ఞానుసారం, నాజీలు జరిపిన మారణకాండలో వేలాదిమంది యూదులు హతులయ్యారు. యుద్ధానంతరం, ఐక్యరాజ్యసమితి పాలస్తీనాలో యూదులకూ, అరబ్బులకూ నిర్ణీత సరిహద్దులతో ప్రత్యేక రాజ్యాలస్థాపనకు ఏర్పాటు చేసింది. 1948 వ సం॥ మే 14న ఇజ్రాయెల్ దేశం ఆవిర్భవించింది. అయితే, మరునాడే దాని సరిహద్దులపై ఈజిప్టు, ఇరాక్, జోర్డాన్, లెబనాన్, సిరియా దేశాలు ఒక్కుమ్మడిగా దాడి

జరిపాయి. అయినప్పటికీ, ఇజ్రాయెల్ అపూర్వ ధైర్యసాహసాలను ప్రదర్శించి, దురాక్రమణదారులను తరిమికొట్టడంతో పాటు, అరబ్‌కని నిర్దేశించిన భూభాగంలో కొంత భాగాన్ని పట్టుకున్నది. అదే సమయంలో, జోర్డాన్‌కు కొంత భాగాన్నీ, ఈజిప్టుకు గాజాప్రాంతాన్నీ ఇజ్రాయెల్ పోగొట్టుకున్నది.

1967 వ సం॥లో ఈజిప్టు, మళ్లీ ఇజ్రాయెల్‌పై ముట్టడికి ఆయత్తమయింది. జోర్డాన్, ఇరాక్ దేశాలు ఈజిప్టుకు సహాయపడాలనుకున్నవి. అయినా, అంతలోనే ఇజ్రాయెల్ మెరుపుదాడి జరిపింది.

ఈజిప్టు, జోర్డాన్, సిరియా దేశాలు వశపరుచుకున్న భూభాగాలపై ఆరు రోజులు జరిగిన యుద్ధంలో ఇజ్రాయెల్, ఈజిప్టు సైన్యాన్ని సినాయ్ ద్వీపకల్పం నుంచి తరుమగొట్టడమే కాకుండా సిరియా నుంచి గోలాన్ హైట్స్‌నూ, జోర్డాన్ నుంచి జోర్డాన్‌నదీ పశ్చిమ తీరాన్ని వశపరచుకున్నది.

ఇప్పుడు జరుగుతూన్న గల్ఫ్ యుద్ధంలో ఇజ్రాయెల్‌కు వ్యతిరేకమైన దేశాలేవీ ఇరాక్‌కు మద్దతునివ్వడంలేదు. నిజానికి ఇరాక్, కువైట్ ఆక్రమణను మధ్యప్రాచ్యదేశాలన్నీ నిరసిస్తున్నాయి. అయినప్పటికీ, ఇజ్రాయెల్‌పై దాడి జరిపి కవ్విస్తే, అది ఎదురు దాడి జరిపినట్టయితే దాని శత్రుదేశాల మద్దతు తనకు లభించగలదని ఇరాక్ ఆశిస్తున్నది. ఆ విధంగా యుద్ధం కొత్తమలుపు తిరుగుతుందని భావిస్తున్నది.






రంగాపురంలోని భూషయ్య పెద్ద వడ్డీ వ్యాపారి. వడ్డీ వ్యాపారం లాభసాటిగా సాగాలంటే, దయాదాక్షిణ్యాలు పాటించని కఠిన ప్రవర్తన అవసరం అన్న నమ్మకం కలవాడు. భూషయ్య వుండేది రంగాపురం అయినప్పటికీ, పక్కనేవున్న పట్టణం లోనే ఆయన వ్యాపారం చక్కగా సాగుతున్నది.

ఒకనాడు భూషయ్య పట్నం వెళ్ళి, ఐదారుగురిదగ్గిర రావలసిన పదివేల రూపాయలు వసూలు చేసుకుని, గ్రామానికి తిరుగుప్రయాణమయ్యాడు. బాగా చీకటి పడడంతో, రంగాపురం వెళ్ళే బాడుగ బళ్ళేమీ దొరకలేదు. ఇక చేసేది లేక ఆయన కాలినడకన బయలుదేరాడు.

భూషయ్య చీకటిలో ఎగుడుదిగుడుగా వున్న బళ్ళ బాటలో జాగ్రత్తగా నడుస్తూ, దుస్తుల్లో దాచుకున్న డబ్బు సంచీని ఒక సారి తాకి చూసుకున్నాడు. సరిగ్గా అ సమయానికే ఆయనకొక సంగతి గుర్తు రావడంతో హడలిపోయాడు.

అ చుట్టుపక్కల పేరుమోసిన గజదొంగ వీరమల్లు, వారం కిందటే జైలు నుంచి విడుదలై తిరిగి వచ్చాడు! వాడుండేది రంగాపురం సమీపానగల గూడెంలో. తాను పట్టణంనుంచి డబ్బుతో తిరిగి వస్తున్నట్టు పసిగడితే, డబ్బుతో పాటు తన ప్రాణాలు కూడా వాడు తీయవచ్చు.

ఇలాంటి భయంతో భూషయ్య మరి కొంత దూరం నడిచేసరికి, వెనకనుంచి, "ఎవరు, బాబూ?" అన్న కంఠస్వరం వినిపించింది.

అది వింటూనే భూషయ్య అదిరిపడి వెనక్కు తిరిగి చూశాడు. చీకటిలో, ఒక అజానుబాహుడైన వ్యక్తి తనకేసి రావడం, ఆయనకు లీలగా కనిపించింది. ఎవడు

కమలా నటరాజన్



వీడు ? గజదొంగ వీరమల్లు కాదుగదా! అనుకున్నాడు భూషయ్య భయంతో వణికిపోతూ.

అంతలో, ఆ వ్యక్తి ఆయనను సమీపించి, ఎడం భుజంమీద వున్న గడ్డపలుగును కుడిభుజానికి మార్చుకుంటూ, "బాబూ, మీరా! నేను భీమయ్యను, పొలంనుంచి వస్తున్నాను," అన్నాడు.

దానితో ప్రాణం కుదుటపడిన భూషయ్య, "ఉదయంనుంచి పట్నంలో డబ్బు రావలసిన వాళ్ళ ఇళ్ళన్నీతిరిగాను. శ్రమ తప్ప, ఒక్కదమ్మిడీ వసూలు కాలేదు. మన గ్రామానికి బయలుదేరే సరికి చీకటిపడిపోయింది," అన్నాడు.

ఇద్దరూ కలిసి కొంతదూరం నడిచాక, బాటకు అడ్డంగా వున్న ఒక చిన్న కాలవ దాటవలసి వచ్చింది. భూషయ్య కాలవలో దిగుతూనే, అక్కడవున్న బురదలో కాలు జారి తూలి ముందుకు పడబోయాడు. అయితే, భీమయ్య ఆయన భుజంపట్టుకుని పడకుండా ఆపాడు.

అంతలో, కాలవ అవతలిగట్టునుంచి, "ఎవరువాళ్ళు ?" అన్న భీకరమైన గొంతు వినిపించింది.

ఆ ప్రశ్నించినవాడు, గజదొంగ వీరమల్లని గ్రహించిన భూషయ్య గజగజలాడిపోతూ, భీమయ్య చెవిలో, "నీతో చిన్న అబద్ధం చెప్పాను, భీమయ్యా! ఇవ్వాళ వసూలయినపది వేలరూపాయలు, ఈ సంచీలో వున్నవి. నీదగ్గర దాయి," అంటూ డబ్బు సంచీని భీమయ్యకిచ్చాడు.

భీమయ్య, భూషయ్యకు భయపడవద్దని ధైర్యం చెప్పి, ఆయనతోపాటు కాలవ దాటి ఒడ్డు చేరాడు.

ఆ వెంటనే, వీరమల్లు భూషయ్యను సమీపించి, ఆయన దుస్తుల్లో వెతికిచూసి, డబ్బేమీ కనబడకపోయేసరికి, "ఇందులో ఏదో మోసం వున్నది! దగ్గిర చిల్లిగవ్వయినా లేకుండా ఎవడైనా ప్రయాణం చేస్తాడా ?" అంటూ భూషయ్య గొంతు పట్టుకున్నాడు.

భూషయ్య విలవిల్లాడిపోతూ, ''భీమయ్యా! రక్షించు! రక్షించు!'' అని అరిచాడు.

అప్పుడు భీమయ్య, ''ఒరే, నువ్వు గజదొంగ వీరమల్లువని, నాకు తెలుసు! నేను రంగాపురం భీమయ్యను,'' అంటూ పలుగును రెండు చేతులతో వడిసి పట్టుకుని, వీరమల్లు కేసి ఒకడుగు వేశాడు.

మరుక్షణం వీరమల్లు, భూషయ్యను వదిలి, అక్కడి నుంచి పారిపోయాడు. ఆ తర్వాత భీమయ్య, భూషయ్యకు తోడుగా ఇంటివరకూ వెళ్ళి, తన దగ్గిర వున్న డబ్బు సంచీని ఆయన కిచ్చాడు.

నెల రోజులు గడిచాక, ఒకనాడు వీరమల్లు, భూషయ్య వద్దకు వెళ్ళి, అమాయకంగా ముఖం పెట్టి, ''బాబూ, మీవల్ల ఒక చిన్న సాయం కావాలి!'' అన్నాడు.

భూషయ్య లోపల భయపడుతూనే పైకి బింకంగా, ''సాయమా! ఏమిటది?'' అని అడిగాడు.

''మా అమ్మాయికి పెళ్ళి సంబంధం కుదిరింది. మీబోటి పెద్దల్ని నమ్ముకునే అందుకు ఒప్పుకున్నాను. వెయ్యి రూపాయిలు ఇచ్చారంటే, ఆరునెలల్లో తిరిగి ఇచ్చేస్తాను,'' అన్నాడు వీరమల్లు.

డబ్బు ఇస్తే రాదేమో, ఇవ్వకపోతే గొడవ చేస్తాడేమో, అని భూషయ్య కొంచెం సేపు ఆలోచించి, చివరకు వాడికి వెయ్యి రూపాయి లిచ్చి పంపాడు.





కిచ్చిన వెయ్యి రూపాయిలు గుర్తు రావడంతో విసుగ్గా, ''నా ఇంట్లో డబ్బు రాసి పోసి వుందా, అడిగినవాడికల్లా ఇవ్వడానికి? గంటకుముందు, ఆ వీరమల్లు వచ్చి, కూతురు పెళ్ళని చెప్పి వెయ్యి రూపాయిలు పట్టుకుపోయాడు. ఇప్పుడు నువ్వు తగలడ్డావు,'' అన్నాడు.

మరేం మాట్లాడలేక భీమయ్య దిగులుగా, ''అంతా తమ దయ, బాబూ!'' అన్నాడు.

''చూడు, భీమయ్యా! ఉన్న మాట అంటున్నందుకు కోపం తెచ్చుకోకు. వీరమల్లుకు అప్పు ఇచ్చానంటే, వాడికి ఎవరి ఇల్లు కొల్లగొట్టయినా నా అప్పు తీర్చేశక్తి వున్నది. మరి నీవల్ల ఏమవుతుంది చెప్పు? రెక్కాడితేగాని డొక్కాడని కూలివాడివి! కావాలంటే, ఇదిగో పది రూపాయిలు తీసుకుపో. నాకు తిరిగి ఇవ్వనవసరం లేదు,'' అన్నాడు భూషయ్య.

భీమయ్య ఆ పది రూపాయిలు తీసుకోకుండా మౌనంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

వీరమల్లు వెళ్ళిన కొంతసేపటికి భీమయ్య వచ్చి, ''బాబుగారూ!'' అంటూ చేతులు జోడించి ఏమో చెప్పబోయేంతలో, భూషయ్య, ''సంగతేమిటి, భీమయ్యా?'' అని ప్రశ్నించాడు.

''నా భార్యకు జబ్బు చేసింది, బాబూ! వారం రోజులుగా మంచం దిగడం లేదు. వైద్యం కోసం పట్నం తీసుకుపోవాలనుకుంటున్నాను. తమర్ని దైవంలా నమ్ముకుని వచ్చాను. ఒక వంద రూపాయిలు అప్పుగా ఇచ్చారంటే, వడ్డీతో సహా చెల్లించుకుంటాను,'' అన్నాడు భీమయ్య.

అది వింటూనే భూషయ్య ముఖం రంగుమారింది. అంతకుముందు వీరమల్లు

రెండు నెలలు గడిచాయి. ఒకనాటి రాత్రి భూషయ్య ఇంట్లో దొంగతనం జరిగింది. విలువయిన బంగారు నగలతో పాటు పాతికవేల రూపాయల రొఖ్ఖం, దొంగల పాలయిందని, ఊరు ఊరంతా చెప్పుకున్నారు.

ఇది జరిగిన వారం రోజుల తర్వాత, భీమయ్య పంటకాలవ నుంచి పొలానికి నీరు పెడుతూండగా, గజదొంగ వీరమల్లు అక్కడికి వచ్చి, చిన్నగా నవ్వుతూ, "రంగాపురం భీమయ్యవు నువ్వేనా ?" అని అడిగాడు.

ఆ సమయంలో వీరమల్లు అక్కడి కెందు కొచ్చాడో అర్థం కాక, భీమయ్య, "అవును, ఆ భీమయ్యను నేనే! నువ్వెవ రైందీ కూడా, నాకు తెలుసు. ఇంతకూ వచ్చిన పనేమిటి ?" అని అడిగాడు.

"ఆ మధ్య చక్రవడ్డీల భూషయ్య దగ్గరకు, నువ్వు అప్పుకెళ్ళావుగదా! పని కాలేదు, అవునా? ఇదిగో ఇప్పుడు నీకు ఈ సంచీ ఇస్తున్నాను. ఇందులో రెండు వందలున్నవి. ఈ డబ్బు ఒకప్పుడు, ఆ భూషయ్యదే—కనక పుణ్యం కూడా ఆయనకే దక్కుతుంది," అంటూ, భీమయ్య ఏదో అనబోయేలోపలే సంచీని చేనుగట్టు మీద వుంచి, వీరమల్లు చకచకా పట్నం దారిపట్టాడు.

భీమయ్య, ఆ సంచీ తీసుకుని తిన్నగా భూషయ్య ఇంటికి వచ్చి, ఆయనకు జరిగింది చెప్పి, "బాబూ, వీరమల్లు ఈ సంచీలో రెండు వందల రూపాయలున్నవన్నాడు. నేను లెక్కపెట్ట లేదు," అంటూ డబ్బు సంచీని ఆయన కివ్వబోయాడు.

అయితే, భూషయ్య ఆ సంచీ తీసుకో కుండా, "నన్ను క్షమించరా, భీమయ్యా! వీరమల్లు వేరెవరి ఇల్లో కొల్లగొట్టయినా, నా బాకీ తీర్చగలడని, ఆ రోజు నీతో అన్నాను. ఆఖరికి వాడో, నా ఇంటినే దోచుకుపోయాడు. ఉపకారం చేసిన నీకు సాయపడక పోగా, అవమానకరంగా మాట్లాడాను. నాకు తగిన శిక్షే పడింది. ఆ డబ్బు నువ్వే వుంచుకో. దాన్ని ఆ రాత్రి నన్ను కాపాడినందుకు, నీకు కృతజ్ఞతగా ఇస్తున్నది. కాదనకు!" అన్నాడు పైపంచతో కళ్ళు తుడుచుకుంటూ.

భీమయ్య చేతులు జోడించి ఆయనకు నమస్కరించి, తన ఇంటికేసి వెళ్ళాడు.



# అనుభవం

పూర్వం శృంగేరి అరణ్యాలలో ఋష్యంగుడు, బదరీనాథుడు అనే ఇద్దరు మునులు తపస్సు చేస్తూండేవాళ్ళు. ఇద్దరూ నడివయసువాళ్ళు. వాళ్ళుండే ఆశ్రమాలు పక్కపక్కనే వుండేవి.

ఒకనాడు బదరీనాథుడు, ఋష్యంగుడితో, "నాకు కొన్నాళ్ళపాటు, ఈ అరణ్యంవదలి ప్రజలమధ్య నివసించాలని వున్నది. ఈ కోరికను అదుపులో పెట్టలేకపోతున్నాను," అన్నాడు.

అది విని ఋష్యంగుడు రెండు క్షణాలు సాలోచనగా వుండిపోయి, తర్వాత, "బదరీనాథా! నీ కోరిక చిత్రంగా వున్నది. అయినా అది నీ కోరిక! అలాగే చెయ్యి," అన్నాడు.

మర్నాడు బదరీనాథుడు అరణ్యం విడిచి, పక్కనే వున్న నగరాన్ని చేరాడు. ఆ నగర సౌందర్యం, వింతలూ, విశేషాలూ అతణ్ణి బాగా ఆకర్షించాయి. అయితే, నెల తిరక్కుండానే అక్కడి పౌర జీవితంలోని మోసాలూ, దగాలూ; ధనంకోసం, అధికారంకోసం వాళ్ళు చేసే కుట్రలూ, జగడాలూ చూసి బదరీనాథుడికి ముఖం మొత్తింది. అతడు నగరంవదిలి, అరణ్యంలోని తన ఆశ్రమానికి వచ్చేశాడు.

బదరీనాథుడు తిరిగిరావడం, ఋష్యంగుడికి చాలా ఆనందం కలిగించింది. అయితే, నగరంలో తనకు కలిగిన అనుభవాల గురించి బదరీనాథుడు చెపుతూంటే, విని విననట్టు ఊరుకో సాగాడు. ఇది గమనించిన బదరీనాథుడు, అతణ్ణి, "నగరజీవితం అంటే, నీకేమాత్రం ఆసక్తి లేకపోవడానికి కారణం ఏమిటి? ధ్యాననిష్ఠ భంగపడుతుందని భయమా?" అని అడిగాడు.

ఋష్యంగుడు అందుకు చిన్నగా నవ్వి, "నగర జీవితాన్ని గురించిన విశేషాలు వినడం అంటే నాకు కలిగేది భయంకాదు, అయిష్టత! నువ్వు పౌరజీవితం నుంచి విరక్తికలగకుండానే, ఏదో తాత్కాలికమైన ఆవేశంతో, మునిలా జీవిద్దామని, ఈ అరణ్యం చేరావు. అందువల్ల, నీ మనస్సు నగర జీవితం రుచిచూడమని అప్పుడప్పుడూ పోరుతూండవచ్చు. అది నీ తప్పు కాదు. నగరజీవితం పట్ల పూర్తిగా విరక్తిచెందని, నీ అనుభవం లేమి తప్పు! ఇక మునిగా ధ్యానంలో నా అంతటి ఏకాగ్రతను సాధించగలవు," అన్నాడు.

ఆ తర్వాత కొంతకాలానికి బదరీనాథుడు, ఋష్యంగుడు చెప్పినట్టే, ధ్యానంలో ఏకాగ్రతన్ను సాధించి మునిగా పరిపూర్ణుడయ్యాడు.

—భీమవరపు పురుషోత్తం





# అపూర్వుడి సాహసయాత్రలు

హిమాలయ పర్వతాల మధ్య ఒక కొండ మీద నిలబడి సదానందముని చుట్టు పక్కల కలయజూశాడు. మంచుతో కప్పబడిన ఆ లోయ అప్పుడే ఉదయిస్తూన్న సూర్యకిరణాల వెలుగులో బంగారు కాంతితో ప్రశాంతంగా మెరుస్తున్నది. లోయకు దిగువ చిన్న చిన్న నదులూ, విశాలమైన మైదానాలూ కనిపించాయి.

ముని తూర్పుదిక్కు కేసి ఒకసారి చూసి, మళ్ళీ లోయ మీదికి దృష్టిని మళ్ళించాడు. ఆయన మనసులో ఎన్నో ఆలోచనలు కలిగాయి. భగవంతుడు ఎంతటి సుందరమైన ప్రకృతిని సృష్టించాడు. అందమైన భూమినీ, భూమిపై రకరకాల పక్షులనూ, మరెన్నో జంతువులనూ సృష్టించాడు. అఖరికి మనిషిని సృష్టించాడు. మనిషికి మంచిని గ్రహించి శాంతియుతంగా ముందుకుసాగే మహోన్నతమైన శక్తిని ప్రసాదించాడు. మంచి నుంచి చెడును వేరుచేసి చూసే వివేకం కూడా ఇచ్చాడు. ఇన్ని ఉన్నప్పటికీ ఇప్పుడు ప్రపంచం ఎలా ఉన్నది? కొందరిలో అంతా తమదే కావాలన్న స్వార్థం పెరగకపోతే ఈ భూమి మరింత అందంగా, ఆనందంగా ఉండేది కదా! మంచి తప్ప ఎదుటివారికి హాని తలపెట్టలేని నూతన మానవజాతి ఆవిర్భావం సాధ్యం కాదా?

ఈ సమస్యను గురించి ముని సుదీర్ఘంగా ఆలోచించి, ఒక నిర్ణయానికి



వచ్చాడు. ప్రకృతి రహస్యాలను ఆకళింపు చేసుకుని సదానందముని తన యోగ శక్తితో ఎన్నో ప్రయోగాలు చేశాడు. ఆఖరికి తన చిరకాల వాంఛకు కార్యరూపం ఇవ్వడానికి ఇప్పుడు సంకల్పించాడు.

''గురువర్యా, శుభఘడియలు అసన్నమయ్యాయి!'' అన్నాడు పక్కనే ఉన్న గుహ నుంచి వెలుపలికి వచ్చిన ముని శిష్యుడు భక్తితో చేతులు జోడించి.

''అవును సోహం! యజ్ఞం పరిసమాప్తి చేయాలి!'' అన్నాడు ముని.

ఇద్దరూ కలిసి గుహ లోపలికి వెళ్ళారు. గుహకు రెండువైపులా ద్వార మార్గాలు ఉన్నాయి. గుహ మధ్య భాగంలో హోమాగ్ని రగులుతున్నది. ముని వెళ్ళి హోమగుండం ముందు కూర్చుని, ''సోహం! ఇప్పుడు అగ్నిని జాగ్రత్తగా చూస్తూవుండు. అగ్నిజ్వాలలు క్రమంగా పైకి ఎగబడాలి. అప్పుడే మనం తలపెట్టిన కార్యం ఫలప్రదమవుతుంది," అని కళ్ళు మూసుకుని కొంతసేపు ధ్యానంలో గడిపాడు. ఆ తరవాత మరి కొంతసేపు దీక్షతో మంత్రాలు జపిస్తూ, వెన్ననూ, కొన్ని పుష్పాలనూ, మరికొన్ని పత్రాలనూ హోమాగ్నికి ఆహుతిచ్చాడు.

అగ్నిజ్వాలల మధ్య క్రమంగా ఒక రూపం ఏర్పడడం చూసి ముని కళ్ళు మెరిశాయి. క్షణంలో అదొక మానవుడి రూపం ధరించింది. మంటలనుంచి వెలుపలికి దూకిన ఆ వ్యక్తికి మనిషికి లాగానే అన్ని అవయవాలూ సక్రమంగా ఉన్నాయి. చూడడానికి చక్కటి బొమ్మ లాగా ఉన్నాడు. అయితే, బొమ్మకన్నా కాస్త ఎత్తుగా ఉన్నాడు.

ఆ వ్యక్తి మునికి నమస్కరించి, ''నేనెవరిని?'' అని అడిగాడు.

''నువ్వు మనిషివి! అయినా మామూలు మనిషివి కావు! చాలా భిన్నమైనవాడివి. యజ్ఞశక్తితో పంచభూతాల నుంచి నిన్ను ప్రత్యక్షంగా సృష్టించాను. నీకు సర్వశక్తులూ ఉన్నాయి. మంచీ చెడూ, కరుణా



"నువ్వు అందరికన్నా ప్రత్యేకమైన వాడివని చెప్పానుకదా! మిగతావాళ్ళ కన్నా నీ మనసు మహోన్నతమైనది. అందరినీ మించిన తెలివితేటలు, శక్తి యుక్తులు నీవి. ఒక వ్యక్తిలో ఒకటి ఎక్కువగా వుంటే వేరొకటి తక్కువగా వుండడం ప్రకృతి నైజం. నీ శరీరం చిన్నదే. అయితే, దాని శక్తి అమోఘం. అందుకే నువ్వు మానవజాతి పురోగతికీ, ప్రపంచ అభ్యుదయానికీ పాటుపడాలి!" అన్నాడు ముని.

"చిత్తం!" అన్నాడా వ్యక్తి.

"నీ ఈ బుల్లిదేహం, శీఘ్ర గమనానికి అనుకూలంగా వుంటుంది," అని చెప్పి కొంతసేపు మౌనం వహించిన ముని మళ్ళీ, "అయినా, నువ్వు ఎప్పటికీ ఇలాగే పొట్టివాడిగా వుండిపోవు. నీ జీవితంలో తొలిదశ పోరాటమయంగా వుంటుంది. విద్రోహశక్తులతో నువ్వు పోరాడవలసి వుంటుంది. మలిదశలో నీకు శాంతియుత జీవితం సంప్రాప్తమవుతుంది. అప్పుడు నీకు మామూలు మానవశరీరం వస్తుంది. అది ఎప్పుడు ఎలా జరుగుతుందో కాలమే నిర్ణయిస్తుంది!" అన్నాడు.

అ తరవాత ముని కళ్ళు మూసుకుని, ఒక్కక్షణం మౌనం వహించి, కళ్ళు తెరిచి మందహాసం చేస్తూ, "నాయనా, క్రౌర్యం, సత్యం అసత్యం, సర్వం నీకు తెలును. అయినా, చెడుపట్లా, క్రౌర్యం పట్లా, అసత్యంపట్లా నీకు ఆసక్తి ఉండదు. మామూలు మనుషులు తమ కోరికలు నెరవేర్చుకోవడానికి పాటు పడతారు. అయితే, నువ్వు ధర్మరక్షణే జీవితాశయంగా కార్యాచరణకు పూనుకుంటావు. నీ ద్వారా నా కల ఫలించినట్టయితే నూతన మానవజాతికి నువ్వే మార్గదర్శకుడవు కాగలవు!" అన్నాడు ముని ఎంతో గంభీరంగా.

"అయినా, నేను అందరికన్నా మరీ పొట్టిగా వున్నాను కదా! ఎందుకలా జరిగింది?" అని అడిగాడా వ్యక్తి.

నీవంటి వాళ్ళు ఇంతకు పూర్వం లేరు. కాబట్టి నీకు 'అపూర్వుడు' అని నామకరణం చేస్తున్నాను,'' అన్నాడు.

ఆ తరవాత ముని ఇచ్ఛానుసారం, సోహం, అపూర్వుడి ముందు కొన్ని ఫలాలు తెచ్చి ఉంచాడు. అపూర్వుడు వాటిలో కొన్ని పళ్ళు తీసి తిన్నాడు.

''నాయనా, ఈ పళ్ళు తిన్నవారికి చాలా రోజులవరకుఆకలిదప్పులుండవు!" అన్నాడు ముని.

''ధన్యవాదాలు మహాత్మా! నేనిప్పుడు గుహనుంచి వెలుపలికి వెళ్ళవచ్చా?'' అని అడిగాడు అపూర్వుడు.

''వెళ్ళవచ్చు. గుహ నుంచి విశాల ప్రపంచంలోకి,'' అన్నాడు ముని.

అపూర్వుడు మునికి భక్తితో నమస్కరించి, గుహనుంచి వెలుపలికి నడిచాడు. అతని వెంట, మునీ, శిష్యుడూ వెలుపలికి వచ్చారు.

వెచ్చటి సూర్యకిరణాలు సోకగానే, ''ఆహా! ఎంత హాయి! ఎంత హాయి! ఎంతో మధురంగా వున్నది!'' అన్నాడు అపూర్వుడు.

''నాయనా, నీ ఈ మధురానుభూతి శాశ్వతం కావాలని ఆశీర్వదిస్తున్నాను. నిజానికి ప్రపంచమే ఎంతో మధురమైనది. కాని, మనిషి తన నీచకృత్యాలవల్ల చేదును సృష్టించుకుంటున్నాడు. ఆ చేదును తొలగించడానికి నువ్వు నీవంతు కర్తవ్యాన్ని నిర్వహించాలి!'' అన్నాడు.





అ మాటలు వింటూన్న అపూర్వుడి కనుబొమలు హఠాత్తుగా ముడి పడ్డాయి. "ఏమిటి నేను వింటున్నవి? ఎక్కడివీ ఆర్తనాదాలు! అవిగో జ్వాలలు! అగ్ని జ్వాలలు నాకు కనిపిస్తున్నాయి," అని అరిచాడు అపూర్వుడు అమితమైన ఆవేదనతో.

"మాకేమీ వినిపించడం లేదే! కనిపించడం లేదే!" అన్నాడు సోహం అమితాశ్చర్యంతో.

"మనం వినలేము. మనకన్నా ఎంతో శక్తివంతమైన ఇంద్రియశక్తులు కలవాడు అపూర్వుడు. దూరంలో మనకు కనిపించని, వినిపించని దృశ్యాలను, శబ్దాలను అపూర్వుడు సులభంగా వినగలడు, చూడగలడు. అంతేకాదు, అతడు వాయు వేగంతో పయనించగల సమర్థుడు," అన్నాడు ముని.

"తండ్రీ, అక్కడ ఏం జరుగుతున్నదో వెళ్ళి చూడడానికి నన్ను అనుమతించండి!" అన్నాడు అపూర్వుడు.

"అలాగే వెళ్ళిరా నాయనా! వెళ్ళిరా! దేవుడే నీకు తోడు!" అని ఆశీర్వదించాడు ముని.

మరుక్షణమే అపూర్వుడు పరిగెత్త సాగాడు. పరుగువేగం పెరిగేకొద్దీ అతడొక గాజుబొమ్మ లాగా మారి, ఆ తరవాత అదృశ్యమైపోయాడు!

"ఏమిటిదంతా! అపూర్వుడెలా మాయమైపోయాడు?" అని అడిగాడు సోహం అమితాశ్చర్యంతో.

"వేగం ఒక స్థాయికి చేరగానే అపూర్వుడి దేహం వెలుగులోనూ, గాలిలోనూ ఒకటిగా కలగలిసి పోతుంది. అందుకే అతడు సాధారణ మానవ నేత్రాలకు కనిపించడు!" అని వివరించాడు ముని.

* * *

"జమీందారుగారి నూతన భవన నిర్మాణానికి రానంటారా? అయితే మీకు మీ కొంపల్లో బతికే ప్రాప్తం లేదు," అని

అరుస్తూ కొందరు దృఢకాయులు మండుతూన్న కాగడాలతో పూరిగుడిసెలకు నిప్పంటిస్తున్నారు.

"ఎంతకాలమని పని చేయగలం బాబూ! మాకూ భార్యా పిల్లలు ఉన్నారు కదా! వాళ్ళనూ పోషించాలి కదా! ఒట్టి పుణ్యానికి రోజూ జమీందారు పనే చూస్తే మా కడుపు లేంకాను? మేం బతికేదెలా? మా భార్యాపిల్లల గతేంకాను?" అంటూ రోదిస్తున్నారు బలహీనులయిన కూలీలు వాళ్ళను అడ్డుకునే శక్తిలేక.

పొగరుబోతులయిన జమీందారు నౌకర్లకు వాళ్ళ మాటలేవీ వినిపించలేదు. దిక్కులు ప్రతిధ్వనించే విధంగా వికటాట్టహాసం చేస్తూ, గుడిసెలకు నిప్పంటించసాగారు. ఒక్కొక్క గుడిసే అగ్నిజ్వాలలకు ఆహుతి కాసాగింది.

హఠాత్తుగా అగ్నిజ్వాలలపై వానజల్లు ప్రారంభమయింది. జమీందారు నౌకర్లు ఆశ్చర్యంతో ఆకాశం కేసి చూశారు. ఒక్క మేఘం లేదు. మబ్బుల్లేకుండా వాన ఎలా కురుస్తున్నది? హఠాత్తుగా ఒక వింత ధ్వని వినిపించింది. అందరూ ఆ ధ్వని వచ్చిన దిక్కుకేసి తిరిగి చూశారు. ఇళ్ళ నానుకుని పారుతూన్న నది మోకాళ్ళ లోతు నీళ్ళలో ఏనుగుల గుంపు! ఆ ఏనుగులు నదిలోని నీళ్ళను తొండాలతో మంటల మీదికి వేగంగా చిమ్ముతూ ఘీంకరిస్తున్నాయి. కొంతసేపటికి మంటలు చల్లారాయి. వెంటనే ఏనుగులు జమీందారు నౌకర్ల మీదికి నీళ్ళు చిమ్ముతూ వాళ్ళను తరుముకున్నాయి. ఈ హఠాత్ పరిణామానికి బెదిరిపోయిన నౌకర్లు ప్రాణభీతితో చెట్టుకొకరు పుట్టకొకరుగా చెల్లాచెదరయ్యారు. వెనక నుంచి ఎవరో పకపకా నవ్వడం వాళ్ళకు వినిపించింది.

పెద్ద ఏనుగు మీద అందమైన బొమ్మలాంటి ఒక వ్యక్తి నిలబడి పకపకా నవ్వుతున్నాడు. ఎవరా విచిత్ర వ్యక్తి? దయ్యమా? దేవుడా? అని నౌకర్లు హడలిపోయారు. —(ఇంకావుంది)

14



# పండితుడి సలహా

పూర్వం కన్యాకుబ్జంలో, పుష్యమిత్రుడనే మహాకవి వుండేవాడు. అయన నిరుపేద. అయన కవిత్వం చదివిన శ్రీభట్టు అనే పండితుడు, "పుష్యమిత్రా! ఇంత మంచి కవిత్వం రాజుగారు వింటే, నీకు పేదరికం లేకుండా చేస్తాడు. వెంటనే వెళ్ళి రాజుగారి దర్శనం చేసుకో," అని సలహా ఇచ్చాడు.

పుష్యమిత్రుడు, రాజదర్శనం చేసుకుని తను రాసిన కవిత్వం వినిపించాడు. రాజు చాలా సంతోషించి పుష్యమిత్రుడికి మంచి బహుమానం ఇవ్వడమే కాకుండా, అయనను తన అస్థానంలో చేర్చుకున్నాడు.

కొంతకాలం తర్వాత పుష్యమిత్రుడు, శ్రీభట్టును కలుసుకుని, "నేనిప్పుడు రాస్తున్న కవిత్వం, రాజాస్థానంలో నేను చేరకముందు రాసిన కవిత్వపుస్థాయిలో లేదని, చాలామంది అంటున్నారు. నాకు కూడా అది నిజమేననిపిస్తున్నది. కారణం ఏమై వుంటుందంటారు?" అని అడిగాడు.

అందుకు శ్రీభట్టు, "అ రోజున నీ కవిత్వాన్ని దృష్టిలో పెట్టుకుని రాజుగారు బహుమానం ఇస్తే, ఇప్పుడు నువ్వు రాజుగారు ఇవ్వబోయే బహుమానాన్ని దృష్టిలో పెట్టుకుని కవిత్వం రాస్తున్నావు. ఈ ధోరణి మార్చుకుంటే, నువ్వు ఈనాడూ మంచి కవిత్వం రాయగలవు," అని చెప్పాడు.

పండితుడన్న మాటల్లోని అంతరార్థం గ్రహించిన పుష్యమిత్రుడు, రాజుగారు ఎలాంటి బహుమానం ఇవ్వబోతారన్న ఆలోచన మాని, తన పూర్వపద్ధతిలో కవిత్వం రాస్తూ, మంచి కవిగా ప్రసిద్ధుడయ్యాడు.

—బి. రఘురామరాజు





# సింహంతో వాగ్వాదం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత భయంకరమైన కాళరాత్రిలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు అమితాశ్చర్యమే కాక, ఒక శంక కూడా కలుగుతున్నది. అదేమిటంటే—ఇంత కఠినశ్రమా, ఇక్కట్లకు ఓర్చి నువ్వు కార్యం సాధించిన తర్వాత, దాని ఫలితం పట్ల ఆసక్తి కనబరచగలవా? నా ఈ ప్రశ్నను వివరించేందుకు, నీకొక కథ చెప్పదలిచాను. బహుశా చాలామంది లాగే, నీకూ నేను చెప్పబోయే కథలోని ప్రథమభాగం తెలిసే వుంటుంది; అది ముగ్గురన్నదమ్ములు—సింహం గురించిన కథ. ఏమైనా అ కథలో నీకు తెలియని

## బేతాళ కథలు



దేమిటో వినిపించే ముందు, నీకు తెలిసిన దేమిటో క్లుప్తంగా చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకానొకప్పుడు దివ్యానందుడనే యోగి ఒక గురుకులం నడుపుతూండేవాడు. ఆయన ఆశ్రమానికి ఒకవైపున అరణ్యం, మరొకవైపున ఎత్తయిన పర్వతంతోపాటు, దాపుల ఒక నది ప్రవహిస్తూండేది. దివ్యానందుడు నివసించే కొండగుహకు ఎదురుగా, విద్యార్థులకోసం కొన్ని కుటీరాలుండేవి.

ఒకసారి ముగ్గురు రాజకుమారులు విద్యాభ్యాసంకోసం గురుకులంలోచేరారు. వాళ్ళల్లో ఒకడు సింహాసనానికి వారసుడు; మిగిలిన ఇద్దరూ అతడి సవతితల్లి కొడుకులు. ముగ్గురూ ఏమంత తెలివైన విద్యార్థులు కారు. అయినా దివ్యానందుడు, వాళ్ళకు ముందు ముందు ప్రయోజనకరంగా వుండే పాఠ్యాంశాలను, ఎంతో శ్రమకోర్చి బోధిస్తూండేవాడు.

అయితే, ముగ్గురు రాజకుమారులకు మాత్రం గురువు బోధించేవాటికన్న, అలౌకిక శక్తుల గురించిన విషయాల్లో ఎక్కువ ఆసక్తి వుండేది. దివ్యానందుడి వద్ద మంత్రశాస్త్రానికి సంబంధించిన అనేక తాళపత్రగ్రంథాలుండేవి. అవకాశందొరికినప్పుడల్లా, గురువు కంటబడకుండా రాజకుమారులు వాటిని చదువుతూండేవారు.

గురుకులంలో గోవిందుడనే విద్యార్థి ఒకడుండేవాడు. వాడు మంచి చురుకుదనం, తెలవితేటలూ, వివేకమూ గలవాడు. వాడు గురువు దగ్గిర యోగవిద్య అభ్యసిస్తూ, విద్య ముగిసిన తరవాత గురుకులంలో యోగిగా వుండిపోవాలని ఆలోచిస్తూండేవాడు. దివ్యానందుడికి, వాడి మీద మంచి అభిమానం వుండేది. తన తదనంతరం గురుకులాన్ని నడపడానికి అవసరమైన యోగ్యత గోవిందుడికున్నదని, ఆయనకు తెలుసు. కాని, వాడింకా మానసికంగా పరిపక్వదశకు రాలేదనీ,

తరచుగా వాడి ఆలోచనలు సంపదల మీదా, సమాజంలో పేరు ప్రఖ్యాతులు గడించడం మీదా లగ్నమవుతున్నవనీ, ఆయన పసికట్టాడు.

ఇలా వుండగా, ఒకనాడు రాకుమారులకు తమ తండ్రి ఆరోగ్యం క్షీణదశలో వున్నదని తెలిసింది. తమను తీసుకుపోయేందుకు రాజధాని నుంచి, రాజోద్యోగులెవరూ రాకపోయినా, తమకు తామై రాజధానికి వెళ్ళాలని వాళ్ళు నిర్ణయించుకున్నారు.

ఈ సంగతి విన్న దివ్యానందుడు, వాళ్ళతో, "మీ విద్య పూర్తయింది. మీరు గురుకులం వదిలి రాజధానికి వెళ్ళడానికి, నాకెలాంటి అభ్యంతరమూ లేదు. కాని, ప్రయాణంలో తోడుగా వుండేందుకు, ఏ రాజదూత అయినా వచ్చేవరకూ ఆగడం మంచిది. అలా కానప్పుడు, మీకు తోడుగా గోవిందుణ్ణి పంపుతాను. అతడు మీకు మంచి మిత్రుడుగదా! అవసరమైనప్పుడు మీకు సలహాదారుగా, పర్యవేక్షకుడుగా వుండగలడు," అన్నాడు.

దీనికి పెద్ద రాజకుమారుడు ఎంతో సంతోషంగా, "అలాగే పంపండి, గురువర్యా, గోవిందుడంటే మాకున్న అభిమానం, గౌరవం మీకు తెలియందికాదు," అన్నాడు.



"మంచిది, నాయనా! నేను గోవిందుణ్ణి నీకు సలహాదారుగానే కాదు, నువ్వు సింహాసనానికి వచ్చిన తర్వాత, అతడు అంగీకరిస్తే ప్రధానమంత్రి పదవి ఇవ్వవలసినదిగా సూచించదలిచాను," అన్నాడు దివ్యానందుడు.

"గురువర్యా, ఇందుకు నేను పూర్తి అంగీకారం తెలుపుకుంటున్నాను. గోవిందుడు నాకు సలహాదారే కాదు, అతణ్ణి మంత్రిగా సన్మానించడం, నాకెంతో ఆనందకారణమవుతుంది," అన్నాడు పెద్ద రాజకుమారుడు.

తర్వాత దివ్యానందుడు, గోవిందుడికి ఏకాంతంలో జరిగింది చెప్పి, "గోవిందా,



నిన్ను నమ్మినవాళ్ళకు రక్షణ ఇవ్వగల శక్తి నీకున్నది. రాకుమారులు మంచి వాళ్ళూ, సామ్యులేకాని, అంతగా వివేకం కలవాళ్ళు కారు. ఆ సంగతి గుర్తుంచుకో!" అని హెచ్చరించాడు.

అందుకు గోవిందుడు వినయంగా, "గురువర్యా, విద్య పూర్తి అయ్యాక, మీ సన్నిధిలోనే శిష్యుడుగా వుండిపోవాలన్నది, నా కోర్కె," అన్నాడు.

ఇది విన్న దివ్యానందుడు చిరునవ్వు నవ్వి, "నీకు భౌతిక సుఖాలపట్లా, కీర్తి అధికారాలపట్లా కొంత ఆసక్తి వున్నదని, నేనెరుగుదును. సత్యధర్మాలకు కట్టుబడి వుంటూ, సమర్థుడైన మంత్రి అనిపించుకోవడం, అంత సులభసాధ్యం కాదని, నాకు తెలుసు. అందువల్ల, ఏనాడైనా అలాంటి పదవిపట్ల, నీకు అసంతృప్తి కలిగితే, ఆశ్రమానికి తిరిగి రావచ్చు," అని చెప్పాడు.

మర్నాడు రాజకుమారులూ, గోవిందుడూ రాజధానికి బయలుదేరి, మిట్ట మధ్యాహ్నం వేళకు అరణ్యంలోని ఒక సెలయేటి ప్రాంతానికి చేరారు. అక్కడ వాళ్ళు తమ వెంట తెచ్చుకున్న రొట్టెలు తిని, సెలయేటి నీరుతాగి విశ్రమించారు.

ఆ సమయంలో, ముగ్గురిలోనూ చిన్నవాడైన రాకుమారుడు, కొద్ది దూరంలో చెల్లాచెదురుగా పడివున్న ఎముకలను చూసి, ఉత్సాహంగా, "ఆహా, ఇవి సింహం ఎముకలు! నాకు తెలిసిన మంత్రం ద్వారా వీటన్నిటినీ ఒకటిగా చేర్చి, సింహం అస్థిపంజరాన్ని తయారు చేయగలను," అన్నాడు.

"అలా అయితే, ఆ అస్థిపంజరంలో నెత్తురూ, పైన చర్మం ఏర్పడేలా చేసే మంత్రం నాకు తెలుసు!" అన్నాడు రెండవ రాజకుమారుడు.

"ఇంకేం! ఆ అస్థిపంజరానికి ప్రాణం పోయగల మంత్రం, నేనెరుగుదును!" అన్నాడు సింహాసనానికి వారసుడైన పెద్ద రాజకుమారుడు.

''ఆగండి! మీరు చేయబోయే పని చాలా ప్రమాదానికి దారి తీస్తుంది,'' అని గోవిందుడు గట్టిగా హెచ్చరించాడు.

అయినా రాజకుమారులు, వాడి హెచ్చరికను లెక్కచేయకుండా, సింహాన్ని వాహనంగా చేసుకుని, తాము రాజధానికి వెళితే, ప్రజలు ఎంతగా ఆశ్చర్య చకితు లవుతారో చర్చించుకోసాగారు. గోవిందుడు, వాళ్ళను మరోసారి హెచ్చరించాడు. కాని, రాజకుమారులు అదేమీ వినిపించు కోకుండా, తమకు తెలిసిన మంత్రాలను ఉచ్చరించడం ప్రారంభించారు. గోవిందుడు చప్పునపోయి, ఒక చెట్టు కొమ్మ మీద కూర్చున్నాడు.

క్షణాల మీద చెల్లాచెదురుగా పడివున్న సింహం ఎముకలన్నీ, అస్థిపంజరంగా తయారైనవి. అంతలో వాటి మీద చర్మం, ఆ మరుక్షణంలోనే ప్రాణం వచ్చి— సింహం లేచి నిలబడి, జూలు విదిలించి భీకరంగా గర్జించింది.

అది చూసి రాజకుమారులు ముగ్గురూ భయకంపితులై నిలువెల్లా వణికి పోసాగారు.

సింహం మరోసారి గర్జించి, రాజ కుమారుల మీదికి దూకబోయేంతలో గోవిందుడు, ''సింహరాజా, ఆగు?'' అంటూ పెద్దగా కేక వేశాడు.



గోవిందుడికి పశుపక్ష్యాదుల భాష తెలుసు. సింహం వాడి కేక విని తల ఎత్తి చూసింది. అప్పుడు గోవిందుడు, సింహాన్ని, ''నీ ప్రాణదాతలను చంప బోతున్నావా? అదేం న్యాయం?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే సింహం శాంతపడి, ''క్షమించాలి, ఈ ముగ్గురూ నాకు ప్రాణం పోశారన్న సంగతి ఎరగను. ఏమైనా వాళ్ళు నాకు ప్రాణంతోపాటు, నాలో ఎక్కడలేని ఆకలినీ పుట్టించారు— బహుశా ఆ ఆకలి, ఏకొద్ది సంవత్సరాలదో కాదు, శతాబ్దాలనాటిదై వుంటుంది!'' అన్నది.



దానికి గోవిందుడు, ''దాపుల రాకుమారులు తప్ప. నీ ఆకలి తీర్చుకునేందుకు మరేదీ లేదని పొరబడకు. నేనున్నాను !'' అంటూ కొమ్మ మీదినుంచి కిందికి దిగబోయాడు.

ఆ వెంటనే సింహం, ''ఆగు! ఒక చిన్న ప్రశ్న; అసలు జీవులు బ్రతికి వుండడంలో గల ప్రయోజనం ఏమిటి?'' అని ప్రశ్నించింది.

''జీవనగమనంలో అభివృద్ధి సాధించేందుకు. అంటే—అజ్ఞానాంధకారం నుంచి బయటపడి, జ్ఞానమనే వెలుగును సందర్శించేందుకు !'' అని జవాబిచ్చాడు గోవిందుడు.

గోవిందుడూ, సింహం ఇలా మాట్లాడుతూండగా, రాజకుమారులు ముగ్గురూ అక్కడి నుంచి చల్లగా జారుకున్నారు. సింహం, గోవిందుల మధ్య ధర్మాధర్మాలను గురించి చర్చ ప్రారంభమైంది.

చివరకు సింహం, ''నా ప్రాణదాతలైన రాకుమారులను చంపి తినకూడదన్న, ధర్మసూత్రానికి నేను కట్టుబడలేను. ప్రాణం చాలా అమూల్యమైనదని నాకు తెలుసు. అయితే, నేను తక్షణం ఆకలి తీర్చుకోకపోతే, ప్రాణాలను కోల్పోతాను. ఈ స్థితిలో నేను ఏ జంతువునూ వేటాడలేను. అందుబాటులో వున్న ఆహారం రాకుమారులు !'' అన్నది.

''అలా అయితే, ఏది కోరదగిందో, ఏది కాదో నాకు తెలియజెప్పినవాడివి నువ్వు. రాజకుమారులు నాకు ప్రాణదానం చేశారని, నువ్వు అని వుండకపోతే, వాళ్ళను చంపి తినివుండేవాణ్ణి. ఇందువల్ల నువ్వు, నాకు జ్ఞానోపదేశం చేసినవాడివి—నా గురువువు. అలాంటి నిన్ను, నేనెలా తినగలను! నీపట్ల నాకు పూర్తి విశ్వాసం వున్నది. ఆకలితో మరణించకుండా, వెంటనే ఏదైనా మార్గం చూపించు,'' అన్నది సింహం.

''నీ మాటలు మెచ్చదగినవి. కాని నేను రాజకుమారుల రక్షకుణ్ణి. అందువల్ల

నన్నే నీ ఆహారంగా చేసుకో," అన్నాడు గోవిందుడు.

ఇంతలో రాజకుమారులు, విల్లంబులు ధరించిన ఇద్దరు ఆటవికులతో అక్కడికి వచ్చారు. గోవిందుడు వారించబోయే లోపలే వాళ్ళు, బాణాలు గురిచేసి సింహాన్ని కొట్టారు. సింహం కిందపడి గిలగిల కొట్టుకుని చచ్చిపోయింది.

ఇది చూసి రాకుమారులు పరమానందం చెందారు. గోవిందుడు చెట్టు దిగి రాగానే, పెద్ద రాజకుమారుడు అతడికి నమస్కరించి, "చాలా కృతజ్ఞులం. నమ్మినవాళ్ళను ఎలా కాపాడాలో, నీకు బాగా తెలుసు," అన్నాడు.

"ఊహుం, నాకేమాత్రం తెలియదు!" అన్నాడు గోవిందుడు.

"నీ వినయ స్వభావ కారణంగా అలా అంటున్నావు. సరే, ఇక బయలుదేరదాం. నిన్ను నా ప్రధానమంత్రిగా నియమించడమే కాదు, రాజ్యంలో ఒక్క రాజు తప్ప, మిగతావారందరికన్నా నిన్ను ధనవంతుణ్ణి చేస్తాను. ముగ్గురు రాకుమారులను రక్షించడమంటే, సామాన్యులవల్ల సాధ్యపడే కార్యం కాదు," అన్నాడు పెద్ద రాజకుమారుడు.

గోవిందుడు ఒక్క క్షణం ఆగి, "నువ్విచ్చే ధనం, నన్ను అతి పేదవాణ్ణి



చేస్తుంది. ఈ ఆటవికుల్ని సాయంగా తీసుకుని, మీ ముగ్గురూ సురక్షితంగా రాజధానికి వెళ్ళండి. నేను గురువుగారి దగ్గిరకు వెళ్ళిపోతున్నాను," అని చెప్పి వెనుదిరిగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గోవిందుడు, రాకుమారులను సింహం బారి నుంచి రక్షించిన మాట నిజమే కదా? అలాంటప్పుడు, తనను నమ్మిన వారిని రక్షించలేనని అతడనడం, అబద్ధం కాదా? అంతేకాక, అతడికి సంపదలపట్లా, సమాజంలో కీర్తి సంపాదించడం మీదా ఆశ వున్న మాట నిజం. అయినప్పటికీ, రాజకుమారుడు ఇస్తానన్న ధనం తనను

అతి పేదవాణ్ణి చేయగలదని చెప్పడం, ఏమంత సమంజసం అనిపించుకుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆకలి గొన్న సింహాన్ని మంచి మాటలతో వారించి, గోవిందుడు రాకుమారుల ప్రాణరక్షణ చేసినమాట నిజం. కాని, అదే గోవిందుడు, రాకుమారులకన్నా ఎక్కువగా తనను నమ్మిన సింహాన్ని రక్షించలేకపోయాడు! ఆ కారణంవల్లనే అతడు, అతను నమ్మిన వారిని రక్షించడం, తనకేమాత్రం తెలియదన్నాడు. మరొక సంగతి: అసలు జీవులు బ్రతికి వుండడంలో గల ప్రయోజనం ఏమిటి? అన్న సింహం ప్రశ్నకు—అజ్ఞానాంధకారం నుంచి బయటపడి, జ్ఞానసముపార్జన చేసేందుకు, అని అతడు జవాబిచ్చాడు. ఆ జవాబే అతడిలో హఠాత్తుగా తన జీవితధ్యేయం ఏమిటన్న జిజ్ఞాసను రేకెత్తించింది. సంపదలపట్లా, ప్రపంచంలో పేరు ప్రఖ్యాతులపట్లా గోవిందుడికి ఆసక్తి వున్న మాట నిజం. అయితే, మనుషుల్లో కొందరిలాగా, అతడు ఎప్పటికప్పుడు తన ప్రవర్తనలోని మంచిచెడుల గురించి ప్రశ్నించుకునే తత్వం గలవాడు. రాజాస్థానంలో చేరి సుఖాలనుభవించడం ద్వారా, తను జీవితంలో ఎన్నో విలువైన మానవతా లక్షణాలను కోల్పోగలనని గ్రహించాడు. ఏ జనక మహారాజు లాంటి అపూర్వ పురుషుడో, తను యోగిలా జీవిస్తూ, రాచకార్యాలను చక్కబెట్టగలడు. గోవిందుడు ఆ కోవకు చెందినవాడు కాదు. అతడికెదురైన సమస్య భోగిలా జీవించడమా, యోగిలా జీవించడమా అన్నది. గోవిందుడు ఆ రెండవ మార్గాన్నే ఎన్నుకుని, గురువు దగ్గిరకు చేరాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మనోజ్‌దాస్ రచన]



# చందమామ అనుబంధం—29

## మహనీయులు కలలుగన్న భారతదేశం:

## ఐకమత్యం!

మన దేశంలోని గొప్ప రాజనీతివేత్తలలో ప్రముఖుడయిన డా. రాజేంద్ర ప్రసాద్ 1884 వ సం॥లో బీహార్‌లో జన్మించాడు. గొప్పగా సాగుతూన్న న్యాయ వాద వృత్తిని వదిలిపెట్టి ఆయన స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నాడు. 1950 వ సం॥ భారతదేశం సర్వస్వతంత్ర రిపబ్లిక్ అయినప్పుడు బాబు రాజేంద్రప్రసాద్ మన మొట్టమొదటి రాష్ట్రపతిగా ఎన్నికయ్యాడు. 1952 వ సం॥లోనూ, 1957 వ సం॥లోనూ ఆయన మళ్ళీ రెండుసార్లు ఆ ఉన్నత పదవికి ఎన్నుకోబడ్డాడు. 1962 వ సం॥ కీర్తిశేషుడయ్యాడు.

1956 వ సం॥ ఆగస్టు 16 వ తేదీన మధురైలో జరిగిన ఒక సభలో రాజేంద్రప్రసాద్ ఇలా అన్నాడు: "ఈనాటి ప్రపంచంలో ముప్పై ఆరుకోట్ల జనాభా గల మన దేశం మహోన్నతమైన పాత్రను నిర్వహించవలసి ఉన్నది. ఈ కాలఘట్టంలో సువిశాలమైన మన భారతదేశం మళ్ళీ చిన్న చిన్న స్వతంత్ర దేశాలుగా విడిపోవడం అన్నది ఊహించరాని విషయం. ఈ కలియుగంలో 'ఐకమత్యమే మహాబలం!' అన్న విషయం మనం మరిచిపోకూడదు. ముప్పై ఆరుకోట్ల భారతీయులందరూ ఒకే వ్యక్తిగా, నిలబడాలి. ఒకే శక్తిగా రూపొందాలి. ఐకమత్యం అంటే కేవలం ఒకేవిధమైన పైపై వేషభాషలలో కనిపించేది కాదు. భిన్నత్వంలో, ఏకత్వం సాధించడంలోనే నిజమైన ఐకమత్యం, ఉన్నది. అదే మన దేశం ప్రత్యేకత!"

## మీకు తెలుసా?

1. ఇండియా, బ్రిటన్, జపాన్, అమెరికా, సోవియట్ రష్యా దేశాలలోని పార్లమెంటుల పేర్లేమిటో మీకు తెలుసా?
2. ప్రపంచంలో కెల్లా అతి పెద్ద దేశం ఏది?
3. అది ఏ ఖండంలో ఉన్నది?
4. రెండవ పెద్ద దేశం ఏది? ఏ ఖండంలో ఉన్నది?
5. మూడవ, నాలగవ, ఐదవ, ఆరవ, ఏడవ పెద్ద దేశాలు ఏవి?

(36 వ పేజీ చూడండి)

# గణపతి



తలపెట్టిన కార్యం విఘ్నం లేకుండా జయప్రదం కావాలని ప్రతి పూజా కార్యక్రమంలోనూ, మొట్టమొదట విఘ్నేశ్వరుడయిన గణపతిని పూజించడం మన సంప్రదాయం.

విఘ్నాలను తొలగించే విఘ్నేశ్వరుడు గణాలకు అధిపతి కావడంవల్ల ఆయన్ను గణపతి, వినాయకుడు అని కూడా అంటారు.

పార్వతీదేవి సృష్టించిన వినాయకుణ్ణి శివపార్వతుల ప్రథమ సంతానంగానూ, కుమారస్వామి అన్నగానూ చెబుతారు. మూషిక వాహనుడైన వినాయకుడు ఏనుగుతల కలిగి ఉండడానికి, పురాణాలు రకరకాల కారణాలు చెబు

తాయి. శనిభగవానుడు ఆగ్రహంతో చూడడంవల్ల బాలవినాయకుడి తల మాయమై పోయిందనీ, ఆ తరవాత ఆ స్థానంలో ఒక ఏనుగు తల అమర్చబడిందనీ ఒక కథ చెబుతుంది. ఈ కథా సందేశం ఏమైనప్పటికీ గజాననుడి విచిత్రరూపం యుగయుగాలుగా భక్తులకు నయనానందం కలిగిస్తున్నది.

కొలిచే భక్తులకు విజయాన్నీ, వివేకాన్నీ ప్రసాదించడంవల్ల— సిద్ధిబుద్ధులను విఘ్నేశ్వరుడి పత్నులుగా భావించి పూజించడం కొన్నిచోట్ల ఆచారంగా ఉంటున్నది.

## చందమామ కబుర్లు





### అతిచిన్న టెలిఫోన్!

జపాన్‌లో ఇటీవల అతి చిన్నదైన టెలిఫోన్‌ను కను గొన్నారు. ఇది చాలా తేలిక కూడా. దీని బరువు 10 ఔన్సులే! పిట్ట కొంచెం కూత ఘనం అన్నట్టు ఇది చూడడానికి మరీ చిన్నదే కాని, మామూలు టెలిఫోన్ల కన్నా చాలా శక్తివంతంగా పని చేస్తుంది.

### తెల్లపులుల ప్రదర్శన!

ఒరిస్సాలోని సుప్రసిద్ధమైన నందన్ కానన్ జంతు ప్రదర్శనశాల సమీపంలో అరుదైన తెల్లపులుల ప్రదర్శన ఏర్పాటు చేయనున్నారు. పార్కులో నడుస్తూ గాని, దానికని ఏర్పాటుచేసిన ఎత్తయిన శిఖరం నుంచి గాని అందమైన ఈ తెల్లపులులను చూడవచ్చు!

# సాహిత్యావలోకనం

1. చరిత్ర రచనకు ఆద్యుడయిన గ్రీకు చరిత్రకారుడు హెరిడోటస్‌కు 'చరిత్ర పితామహుడు' అన్న బిరుదును ఇచ్చినవారెవరు ?

2. ఆంగ్లసాహిత్యంలో పెద్దలకు వ్యంగ్య రచనగా వెలువడి పిల్లల కావ్యంగా ప్రసిద్ధిగాంచిన పుస్తకం ఏది ?

3. ప్రభుత్వం గుర్తింపు పొందిన భారతీయ భాషలు ఎన్ని ?

4. అవి ఏవి ?

5. అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాష ఏది ? దాని తరవాత ఎక్కువగా మాట్లాడే నాలుగు భాషలు ఏవో తెలుసా ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. లోక్‌సభ, రాజ్యసభ; హౌస్ ఆఫ్ కామన్స్, హౌస్ ఆఫ్ లార్డ్స్; డైట్; కాంగ్రెస్; సుప్రీమ్ సోవియట్.

2. సోవియట్ రష్యా.

3. ఆసియా, ఐరోపా ఖండాలలో విస్తరించి ఉన్నది.

4. కెనడా; ఉత్తర అమెరికా.

0. చైనా, అమెరికా, బ్రెజిల్, ఆస్ట్రేలియా, ఇండియా.

సాహిత్యం

1. క్రీ. పూ. మొదటి శతాబ్దానికి చెందిన రోమన్ తత్వవేత్త సిసిరో ఆయన్ను అలా వర్ణించాడు.

2. జొనాథన్ స్విఫ్ట్ రచించిన 'గలివర్స్ ట్రావెల్స్'.

3. పదిహేను.

4. అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, హిందీ, కన్నడం, కాశ్మీరీ, మలయాళం, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం, తమిళం, తెలుగు, ఉర్దూ, సింధీ.

5. హిందీ. దాని తరవాత తెలుగు, బెంగాలీ, మరాఠీ, తమిళం ఎక్కువగా మాట్లాడతారు.



ప్రపంచ పురాణగాథలు - 4

## ఎదురుతిరిగిన కుట్ర!

అర్గోస్ రాజు ప్రోయిటస్ భవనానికి, బెల్లీరోఫన్ అనే యువరాజు ఒకప్పుడు అతిథిగా వచ్చాడు. చాలా అందంగా వున్న ఆ యువకుడి తెలివితేటలు చూసిన ప్రోయిటస్‌కు అసూయా ద్వేషాలు ఏర్పడ్డాయి. ఎలాగయినా ఆ యువకుణ్ణి హతమార్చాలన్న దురాలోచన అతనికి కలిగింది.

ఒకనాడు ప్రోయిటస్ బెల్లీరోఫన్‌తో, "గుర్రపుస్వారీలో నువ్వు సాటిలేని వీరుడివి. మా మామ లైసియారాజు జొబేటస్‌కు వెంటనే ఒక వార్త అందజేయాలి. ఆ పని కాస్త చేస్తావా?" అని అడిగాడు. బెల్లీరోఫన్ అందుకు అంగీకరించి, ప్రోయిటస్ ఇచ్చిన లేఖ తీసుకుని లైసియాకు బయలుదేరాడు.





లైసియారాజు ఆ లేఖను అందుకుని చదివాడు. లేఖ తెచ్చిన యువకుణ్ణి హతమార్చమని అందులో ఉన్నది. ఆ సమయంలో దాపులనున్న ఒక కొండ మీదికి భయంకరమైన భూతం ఒకటి వచ్చి చేరింది.



ప్రజలను హింసిస్తున్న ఆ భూతం గురించి వివరించి దాని అంతు చూడమని, రాజు బెల్లిరోఫన్‌ను ఆదేశించాడు. బెల్లిరోఫన్ నరేసని అప్పటికప్పుడే కొండ మీదికి బయలుదేరాడు.

ఖిమేరా అనే ఆ భయంకర భూతం, ఒక వైపున సింహం తలా, మరొక వైపున మేక తలా మధ్యన ఒక పెద్ద తలా గలిగిన వింతప్రాణి! మూడు తలలు గల ఆ భూతం నోటి నుంచి వెలువడే అగ్నిజ్వాలలు సమీపించిన వారిని క్షణంలో దహించి వేసేవి!





ఆ భీకరభూతాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలియక, బెల్లిరోఫన్ భగవధ్యానంలో కూర్చున్నాడు. అతని భక్తికి సంతసించిన 'మినర్వా' దేవత ప్రత్యక్షమై అతనికి పెగాసస్ అనే ఒక రెక్కల గుర్రాన్ని ప్రసాదించింది.

మెరుపువేగంతో పయనించగల ఆ అద్భుతమైన గుర్రాన్ని చూసి బెల్లీరోఫన్ పరమానందం చెందాడు. అతడు అమితోత్సాహంతో దాన్ని అధిరోహించి, భూతం మీదికి వెళ్ళాడు.





గుర్రంమీద ఆకాశంలో ఎగురుతూ, బెల్లీరోఫన్ భూతంతో ధైర్యంగా పోరాడాడు. దాని నోటి నుంచి వెలువడే అగ్నిజ్వాలలనుంచి ఒడుపుగా తప్పించుకుంటూ, పైనుంచి ఆయుధంతో పొడిచి ఆ భూతాన్ని హతమార్చాడు.

భూతాన్ని చంపి, విజయోత్సాహంతో తిరిగివచ్చిన బెల్లీరోఫన్‌కు రాజు జొబేటస్ ఘనంగా స్వాగతం పలికాడు. అయితే, అతణ్ణి హతమార్చే మరొక ఉపాయం గురించి ఆలోచించ సాగాడు.





బెల్లీరోఫన్ అపురూప ధైర్యసాహసాలకు మెచ్చి, జొబేటస్ రాజు చిన్న కుమార్తె, అతణ్ణి అభిమానించసాగింది. సంగతి గ్రహించిన రాజు ఆమెను బెల్లీరోఫన్‌కు ఇచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు.

బెల్లీరోఫన్‌కు లైసియా రాకుమార్తెతో వివాహం జరిగింది. విషయం తెలిసిన అర్గోస్ రాజు ప్రోయిటస్—తన కుట్ర ఎదురుతిరిగినందుకు ఎంతో బాధ పడ్డాడు. కాని అతడు వివాహానికి రాక తప్పింది కాదు!





జొబేటస్ రాజుకు పురుషసంతతి లేక పోవడంవల్ల, ఆయన తదనంతరం బెల్లీరోఫన్ లైసియా రాజయ్యాడు. ఆయన ప్రజలను ఏ కొరతా లేకుండా కన్నబిడ్డల్లా చిరకాలం పరిపాలించాడు.



# యుక్తిపరుడు

చంద్రపురానికి సీతారామయ్య గ్రామాధికారి. ఆయన చాలా దుష్టుడు. అమాయకులను వేధించి ఆనందించేవాడు.

గ్రామంలో వీరయ్య అనే అమాయకుడొకడున్నాడు. వాడితో ఆయన, "ఒరే, రోజూ మా ఇంటికొచ్చి అన్ని పనులూ చేసి పెట్టావంటే, దేవుడు నిన్ను గొప్పవాణ్ణి చేస్తాడు!" అని చెప్పాడు.

ఇది నిజమే అనుకుని వీరయ్య, సీతారామయ్య ఇంటి పనులు చేయసాగాడు.

గ్రామవైద్యుడు రామయ్య ఎంతో మంచివాడు. డబ్బు గురించి నొప్పించకుండా, అడిగినవారందరికీ వైద్యం చేసేవాడు. అందుకు మెచ్చుకునేందుకు బదులుగా సీతారామయ్య, "రామయ్య గత జన్మలో ఎన్నో పాపాలు చేశాడు. ఎందరికో బాకీలు ఎగ్గొట్టాడు. ఈ జన్మలో ఆ ఋణం తీర్చుకుంటున్నాడు," అని ఎగతాళి చేసేవాడు.

పదిమందికీ చదువు చెప్పే పంతుల్ని పలకరించి, "చచ్చినవాళ్ళేమవుతారో తెలుసా?" అని అడిగేవాడు.

పంతులు తెలియదని తలూపితే, "చచ్చినవాళ్ళు దయ్యాలై పిల్లలకు పాఠాలు చెబుతూంటారు, కావాలంటే పిల్లల్నడుగు, చెబుతారు," అనేవాడు.

ఇది విని పిల్లలు గొల్లుమంటూ నవ్వేవారు.

ఇలా వాళ్ళూ వీళ్ళూ అని కాకుండా, అందర్నీ అవమానిస్తూంటే, గ్రామాధికారి అన్న గౌరవం కొద్దీ కొందరు, మొహమాటం కొద్దీ కొందరు, ఎందు కొచ్చిన గొడవలే అని కొందరూ ఊరుకునేవారు.

ఆ ఊళ్ళో రామాలయముంది. దానికి పూజారి గోపాలయ్య. ఒకసారి గోపాలయ్య ఇంటికి మాధవయ్య అనే దూరపుబంధువు వచ్చాడు. గోపాలయ్య, మాధవయ్య ఒక

జొన్నలగడ్డ రామలక్ష్మి



రోజున ఇంటి అరుగు మీద కూర్చుని నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ సమయంలో అలా దారిన పోతున్న సీతారామయ్య అది చూశాడు. ఆయనకు ఎవరైనా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూంటే కిట్టదు.

''ఏమయ్యా పూజారీ? నీ ఇంట్లో ఏం కష్టం వచ్చిందని, అలా దుఃఖపడుతున్నావు? నాకు చెబితే సాయపడతాను,'' అన్నాడు సీతారామయ్య.

ఇది విని పొరుగూరు వాడైన మాధవయ్య ఆశ్చర్యపడి, ''మా గోపాలయ్య నవ్వుతూంటే, దుఃఖపడుతున్నారంటారేమిటి? ఎవరు మీరు?'' అని అడిగాడు.

''మరిచేపోయాను. గోపాలయ్య నవ్వినా ఏడ్చినట్టే వుంటుందికదూ!'' అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సీతారామయ్య.

మాధవయ్య తెల్లబోయి, ''ఎవడు వాడు? ఏమాత్రం మంచీ మర్యాదా తెలిసినవాడుగా లేడే?'' అన్నాడు.

''వాడు మా గ్రామాధికారి. వాడి బుద్ధే అంత! దుష్టుడికి దూరంగా వుండమని సామెత. అందుకే ఎవరం వాడి మాటలు పట్టించుకోం,'' అన్నాడు గోపాలయ్య.

''పట్టించుకోకపోతే ఎలా? ఇలాంటి వాడికి బుద్ధి చెప్పకపోతే పేట్రేగిపోతాడు. అందుకు ఏదో ఒక ఉపాయం ఆలోచించాలి,'' అన్నాడు మాధవయ్య.

ఆ గ్రామంలో, ఎక్కడా లేని ఒక వింత సంప్రదాయ మున్నది. పర్వదినం రోజున రాత్రి ఊరి రచ్చబండ దగ్గిర పెద్దలందరూ చేరి మత్తు కలిగించే ఒక పానీయాన్ని సేవిస్తారు. అందువల్ల, మనిషి ఆ ఏడాది పాటూ పడిన కష్టాలన్నీ మరిచి సుఖంగా వుంటాడని వాళ్ళ నమ్మకం.

నాలుగు రోజుల తర్వాత పర్వదినం వచ్చింది. ఊరి పెద్దలందరూ రచ్చబండ దగ్గిర చేరి మత్తుపానీయాన్ని సేవించారు. ఆ సమయంలో మాధవయ్య, గ్రామాధికారి సీతారామయ్య పక్కనే కూర్చున్నాడు.

మర్నాటి ఉదయం మాధవయ్య, సీతారామయ్యను కలుసుకుని, ''అయ్యా, రాత్రి ఆ వింత మత్తుపానీయం ప్రభావం వల్ల, నేనొక పొరబాటు చేశాను. తమరిని నానా దుర్భాషలూ అని నిందించాను. అందుకు నేను పదిమంది ఎదుటా క్షమాపణ చెప్పుకుంటాను. పెద్దలందరినీ పిలిపించండి,'' అన్నాడు.

ఇది తనకు చక్కటి వినోదంగా భావించి, సీతారామయ్య ఊరి పెద్దలందరికీ కబురు పెట్టాడు. వారందరి ఎదుటా మాధవయ్య, ''వీరయ్య వంటి అమాయకుడిచేత ఊడిగం చేయించుకుంటున్నావు. ఏదో ఒక రోజున నువ్వు వాడింట్లో అడుసుతొక్కుతావులే అన్నాను. వైద్యుడి మంచితనాన్ని గుర్తించని పచ్చకామెర్లరోగివి అన్నాను. పిల్లలకు పాఠాలు చెప్పే పంతుల్ని దయ్యంగా భావించే రాక్షసుడివి అన్నాను....'' అంటూ ఊళ్ళో సీతారామయ్య చేసే చెడు పనులన్నీ ఏకరువుపెట్టి, ''అయ్యా, ఇందుకు నా కెంతగానో బాధగా వున్నది. మత్తులో అలా అన్నాను. నన్ను మన్నించు,'' అన్నాడు.

ఒక పెద్దమనిషి మాధవయ్యతో, ''అంతా నీ భ్రమ! నువ్వు ఏమీ అనలేదు. అక్కడ మేమూ వున్నాం గదా,'' అన్నాడు.

''భ్రమ ఎలా అవుతుంది? అసలివన్నీ వాడికెలా తెలిశాయి?'' అన్నాడు సీతారామయ్య కోపంగా.

''ఎందుకు తెలియవు? నేనీ ఊళ్ళో అడుగుపెట్టిన మర్నాటి నుంచీ, ఎవరి నోట విన్నా ఈ మాటలే కదా!'' అన్నాడు మాధవయ్య.

సీతారామయ్య సిగ్గుతో తల వంచుకున్నాడు. ఎదురుగా ఏమీ అనకపోయినా, తను చేస్తున్న దుర్మార్గాలను, అంతా ఏవగించుకుంటున్నారని ఆయన గ్రహించాడు. ఆ రోజు నుంచీ ఆయనలో మంచి మార్పు వచ్చింది.

సీతారామయ్య దుర్మార్గాలను యుక్తిగా ఆయనకు చెప్పిన మాధవయ్యను, గోపాలయ్య ఎంతగానో మెచ్చుకున్నాడు.



# మాటకారి పొగడ్త

విశాలదేశాన్ని కీర్తివర్మ అనే రాజు పాలించే కాలంలో, ప్రహాసుడనే మంచి మాటకారి, ఆ రాజ్యాన్ని చూడవచ్చాడు. అతడికి ఎక్కడ చూసినా, దేశం సిరిసంపదలతో వెల్లివిరుస్తున్నది.

ప్రహాసుడు, రాజును దర్శించి, "ప్రభూ! మీ రాజ్యం సర్వసంపదలతో కళకళలాడుతున్నది. కానీ, మీ రాజ్యంలో తెలివితక్కువవాళ్ళ సంఖ్యా పెరుగుతున్నదేమో అన్న అనుమానం నన్ను బాధిస్తున్నది. నా లెక్కప్రకారం మీ రాజ్యంలో తెలివితక్కువవాళ్ళు నూటపన్నెండు మంది వున్నారు!" అన్నాడు.

రాజు ఒకక్షణం ఆలోచిస్తూ వూరుకుని, "నూటపన్నెండు అనేది, రాజధానీ నగరానికి చుట్టుపక్కల వున్న గ్రామాల సంఖ్యా. అంటే—గ్రామానికొక తెలివితక్కువవాడు ఉన్నాడనుకోవాలా?" అని ప్రశ్నించాడు.

"అవును, ప్రభూ! మీ రాజ్యంలో ప్రజల మధ్య తగవులూ, సమస్యలూ అంటూ ఏమీ లేకపోవడంతో, ఆ నూటపన్నెండు మంది గ్రామాధికారుల మెదళ్ళకు పనిలేక మొద్దుబారి పోయినై," అన్నాడు ప్రహాసుడు.

కీర్తివర్మ అతడి మాటలకు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

అప్పుడు ఆస్థాన విదూషకుడైన విచలుడు, రాజుతో, "ప్రభూ! ఇతడి లెక్క తప్పు. మన రాజ్యంలో తెలివితక్కువవాళ్ళ సంఖ్యా నూటపదమూడు," అన్నాడు.

"ఆ కొత్తవాడెవడు?" అని అడిగాడు రాజు.

"ఈ ప్రహాసుడే, ఆ నూటపదమూడోవాడు! పొగడ్తలకు లొంగని మిమ్మల్ని పొగడి, బహుమానం సంపాదిద్దామనుకున్న ఇతడు తెలివితక్కువవాడు కాక మరేమిటి?" అన్నాడు విచలుడు.

ప్రహాసుడు, విచలుడి మాటలకేమీ చలించకుండా, "ప్రభూ! నేను బహుమానాలకు ఆశపడి వచ్చానా లేదా అనేది వేరే విషయం. ఒకవేళ మీరు, నాకేదైనా బహూకరించినా, అది నా మాటకారితనానికి మెచ్చి ఇస్తారుకానీ, నా పొగడ్తలకు సంతసించి కాదని నాకు తెలుసు. సుభిక్షమైన మీ రాజ్యం దర్శించాక కూడా, మిమ్మల్ని పొగడకుండా వెళ్ళిపోయేవాడు తెలివి తక్కువవాడవుతాడుగానీ, పొగడినవాడు కాదుగదా! అందువల్ల, నా లెక్క సరైనదే," అన్నాడు.

ఆ మాటలకు కీర్తివర్మ పెద్దగా నవ్వి, "నీది పొగడ్తో, మాటకారితనమో అర్థం కావడం లేదు! ఏమైనా నువ్వు బహుమానానికి అర్హుడివి," అంటూ మెడలోని హారం తీసి, ప్రహాసుడికి బహూకరించాడు.

—వక్కలంక 'కిషోర్'





# వీరహనుమాన్

సంపాతి సీత జాడ ఆ విధంగా చెప్పేసరికి వానరులు పట్టరాని ఆనందంతో చిందులు తొక్కుతూ, సింహనాదాలు చేశారు. వాళ్ళు లంకకు వెళ్ళే ప్రయత్నంలో సముద్ర తీరాన్ని చేరారు. ఆ మహాసముద్రాన్ని చూడగానే వాళ్ళకు పెద్ద నిరుత్సాహం పుట్టుకొచ్చింది. అది మహాభయంకరంగా ఉన్నది. అందులో భయంకరమైన ప్రాణులున్నాయి. అది ఒక ప్రాంతంలో ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుకనిపించినా, అక్కడక్కడ ఎత్తయిన తరంగాలు లేచి విరిగిపడుతూ భయపెట్టుతున్నది. దాని అవతలి ఒడ్డు కనిపించటం లేదు.

"ఇప్పుడేం చెయ్యాలి?" అని వానరులు తమనుతాము ప్రశ్నించుకున్నారు.

తన వాళ్ళందరూ సముద్రాన్ని చూసి బెదిరినట్టు గ్రహించి అంగదుడు, "భయపడకండి. భయంవల్ల ప్రయోజనం లేకపోగా అది మననే తినేస్తుంది. ఇది మన పరాక్రమం చూపవలసిన సమయం. పరాక్రమంతోగాని పని జరగదు," అని హెచ్చరించాడు.

ఆ రాత్రికి అందరూ సముద్రతీరానే మకాం వేశారు. మర్నాడు తెల్లవారగానే అంగదుడు వానర సేనను సమావేశపరిచాడు. ఆ వానరులను సమావేశపరచగల శక్తి అంగదుడికీ, హనుమంతుడికీ తప్ప మరెవరికీ లేదు.

"మనలో ఏ మహావీరుడు ఈ సముద్రాన్ని దాటి, లంకలో ఉన్న సీతాదేవిని

10. లంకకు హనుమంతుడి ప్రయాణం



చూసి తిరిగి వచ్చి, సుగ్రీవుడి ఆజ్ఞ నిర్వర్తించామన్న మాట దక్కేటట్టు చేయగలడు? లంకకూ ఇక్కడికీ మధ్య నూరుయోజనాల దూరం ఉన్నది. దాన్ని దాటగల వాడే మనకు ఇళ్ళకు తిరిగి వెళ్ళే ప్రాప్తి. మన భార్యలతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించే ప్రాప్తి మనకు కలిగించగలడు. మనం తిరిగి వెళ్ళి, సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ మన మొహాలు చూపించటానికి అతడే పుణ్యం కట్టుకోవాలి. నూరుయోజనాల సముద్రాన్ని మీలో ఎవరు దాటగలరో చెప్పండి. మా ఆరాటం తీర్చండి.'' అన్నాడు అంగదుడు వానరపరివారంతో.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరూ చెక్కిన బొమ్మల్లా ఉండిపోయారు.

అది చూసి అంగదుడు తిరిగి, ''మీరంతా మేటి బలపరాక్రమాలు గల వాళ్ళు! గొప్ప పేరు ప్రఖ్యాతులూ, గొప్ప పుట్టుకలూ కలవారు; ప్రసిద్ధమైన గమనం గలవారు కదా! కనీసం మీరు ఎంతెంత దూరం దాటగలరో చెప్పండి!'' అన్నాడు.

ఈ ప్రశ్నకు కొందరు వానరవీరులు తమ తమ శక్తి సామర్థ్యాలు ఈ విధంగా వివరించారు:

గజుడు తాను పది యోజనాలు దూకగల నన్నాడు; గవాక్షుడు ఇరవై యోజనాలు దూకగల నన్నాడు; గవయుడు ముప్ఫై యోజనాలు దూకగల నన్నాడు; శరభుడు నలభై యోజనాలు దూకగల నన్నాడు; గంధమాదనుడు యాభై యోజనాలూ, మైందుడు అరవై యోజనాలూ, ద్వివిదుడు డెభ్భై యోజనాలూ, సుషేణుడు ఎనభై యోజనాలూ దూకగలమని చెప్పారు.

తరవాత జాంబవంతుడు, ''దూకటంలో నాకు పెద్ద నేర్పే ఉండేది. ఇప్పుడంటే ముసలివాణ్ణి అయిపోతిని. అయినా రామ కార్యం గనక ఒళ్ళు దాచుకోవటం తగదు. నన్ను మీరంతా దూకమంటే

తొంభై యోజనాలు నిస్సందేహంగా దూకుతాను,'' అన్నాడు.

అందరూ చెప్పిన మాటలు విన్న మీదట అంగదుడు, ''ఈ నూరు యోజనాల దూరమూ నేనే దూకగలను. తిరిగి రాగలనా అన్నదే నా సందేహం,'' అన్నాడు.

అది విని జాంబవంతుడు, ''అబ్బో, నీ శక్తి సామర్థ్యాలు మాకు తెలియవా? నూరు యోజనాలేమిటి, వెయ్యి యోజనాలు కూడా నువ్వు అవలీలగా దూకగలవు! తిరిగి అలాగే వచ్చెయ్యగలవు కూడా! అందులో ఎలాటి సందేహమూ లేదు. కాని నువ్వు రాజువు. అందుచేత నిన్ను పంపటానికి ఎంత మాత్రమూ వీలు లేదు. నువ్వు మాలో ఎవరిని పంపినా పంపవచ్చుగాని, నీవై పోరాదు! నీ క్షేమం చూడటం మా అందరి బాధ్యత! నువ్వు లంకకు వెళ్ళితే మమ్మల్ని ఎవరు చూస్తారు? మేం ఏం చెయ్యగలం?'' అన్నాడు.

దానికి అంగదుడు, ''సముద్రాన్ని నేనూ దాటక, మీలో ఎవరూ దాటలేకపోతే మనమంతా ప్రాయోపవేశం చేద్దామా? పని పూర్తి కాకుండా కిష్కింధకు తిరిగి వెళ్ళి ప్రాణాలతో ఉంటామన్న ఆశలేదు గదా! ఆ సుగ్రీవుడు మనని తప్పక



చంపించేస్తాడు. అందుచేత, మాలో పెద్దవాడివైన నువ్వు పని జరిగే మార్గం ఏమిటో బాగా ఆలోచించి చెప్పు!'' అన్నాడు జాంబవంతుడితో.

దానికి జాంబవంతుడు అంగదుడితో, ''పని జరిగి తీరుతుంది. ఈ పని చెయ్యగల వాణ్ణి, ఇదుగో చూపిస్తాను,'' అని, ఒక పక్కగా ఏమీ పట్టనట్టు కూర్చుని ఉన్న హనుమంతుణ్ణి సమీపించి ఇలా అన్నాడు:

''హనుమంతుడా, నువ్వు వానర వీరులలో కెల్లా మేటివి, సమస్త శాస్త్రాలూ చదివినవాడివీ అయి ఉండి కూడా, మాటా పలుకూ లేకుండా ఇలా కూర్చుని



ఉన్నా వేమిటి? ఆ గరుత్మంతుడి రెక్కలకు ఉన్నంత బలం నీ బాహువుల కున్నది. పరాక్రమంలో నువ్వు సుగ్రీవుడికీ, లక్ష్మణుడికీ తీసిపోవు. ఇక ఇతర ప్రాణులను నీతో పోల్చటానికే లేదు. ఈ సంగతి నీకు తెలీదా? నాయనా, నువ్వు పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండుగా భ్రమపడి మింగటానికి ఆకాశంలోకి ఎగిరావే, దూకటంలో నీకు సాటి ఎవరు? మా అందరికీ నీ శక్తి ఇప్పుడు చూపించు. ఈ సముద్రాన్ని దాటు.''

ఈ మాటలు వినగానే అత్యద్భుతంగా హనుమంతుడి శరీరం విపరీతంగా పెరిగి పోయింది. హనుమంతుడు సముద్రాన్ని దాటటానికి సంసిద్ధుడు కావటమూ, అతని శరీరం పెరగటమూ చూసి మిగిలిన వానరులు పరమానందంతో అతన్ని ప్రశంసిస్తూ పెద్దగా సింహనాదాలు చేశారు.

వానరులు మెచ్చుకుంటున్న కొద్దీ హనుమంతుడు వామనుడి లాగా పెరిగి పోయాడు. అతని బలపరాక్రమాలు కూడా పెరిగాయి. అతని ముఖం ఎర్రగా, పొగ లేని నిప్పు లాగా ఉన్నది.

అప్పుడు హనుమంతుడు లేచి నిలబడి, వృద్ధ వానరులకు నమస్కారం చేసి, ''నేను సముద్రాన్ని వాయువు దాటినంత సులభంగా దాటుతాను. మధ్యలో ఎక్కడా ఆగను. నేను ఉదయగిరి నుంచి సూర్యుడితో బాటే బయలుదేరి, అతని కన్న ముందే అస్తగిరి చేరి, అతనికి ఎదురుగా రాగలను. నేను ఆకాశంలో వెళ్ళే వేగానికి సముద్రం నా వెంట రాగలదు. నేను సముద్రం దాటేటప్పుడు ఆకాశంలో మేఘాలు చెల్లా చెదరవుతాయి; పర్వతాలు కంపిస్తాయి. నేను తప్పక సీతను చూసి వస్తాను. నాకు మంచి శకునాలు కనబడుతున్నాయి. అవసరమైతే లంకను మొత్తంగా పెల్లగించి, భుజాన వేసుకొని వెంట తెస్తాను,'' అన్నాడు.

హనుమంతుడు ఇలా చెబుతుంటే వానరులకు ఆనందంతో బాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

జాంబవంతుడు అతనితో, "నాయనా, నువ్వు మా అందరి బాధా పోగొట్టావు. నువ్వు వెళ్ళే పని నెరవేరగలందులకు మేమందరమూ ధ్యానిస్తాం. మా ఆశీర్వచనాలతో నువ్వు సముద్రాన్ని దాటు. మా అందరి ప్రాణాలూ నీ చేతిలో ఉన్నాయి." అన్నాడు.



"నేను పైకి ఎగిరేటప్పుడు నా పాదాల తోపుడుకు భూమి ఆగదు. అందుచేత నేను ఈ మహేంద్రపర్వతం మీది నుంచి ఎగురుతాను," అంటూ హనుమంతుడు, వేగంగా పోయి ఆ పర్వతం పైకి ఎక్కాడు.

అతను పర్వతం మీదికి వెళ్ళి, ఎగిరే ముందు పర్వతాన్ని చేతులతోనూ, కాళ్ళతోనూ ఊపి చూశాడు. అచలంగా ఉండవలిసిన ఆ పర్వతం చాలాసేపు కంపించిపోయి, దాని మీద వున్న చెట్ల పూలన్నీ రాలిపోయాయి; రాళ్ళు దొర్లాయి; పర్వతం మీది గుహలలో ఉండే జంతువులు వికృతంగా ఏడ్చాయి. పర్వతం మీద ఉండే ఋషులూ, విద్యాధరులూ పర్వతం బద్దలైపోతున్నదని భయపడ్డారు. విద్యాధరులు తమ స్త్రీలతో సహా ఆకాశంలోకి లేచారు. వాళ్ళకు మహాకాయుడైన హనుమంతుడు కనిపించాడు.

హనుమంతుడు గాలిలోకి లేవబోతూ తన తోకను విదిలించి, చేతులు బిగబట్టి, కాళ్ళు వంచి, శ్వాస స్తంభించి, తాను పోబోయే ఆకాశమార్గం చూసుకుని వానరులతో, "నేను లంకకు పోతున్నాను. అక్కడ సీత కనిపించకపోతే, అక్కడి నుంచి తిన్నగా స్వర్గానికే వెళతాను. అక్కడ కూడా సీత కనబడకపోయిందో, తిరిగి లంకకు వచ్చి రావణుణ్ణి బంధించి తెస్తాను. లేదా, రావణుడితో సహా లంకనే తెస్తాను," అన్నాడు.



అతనితోపాటు కదులుతున్నది. అతను వెళ్ళే దిక్కుగా సముద్రం తెర్లుతున్నది.

అలా వెళుతున్న హనుమంతుణ్ణి చూసి సముద్రుడు ఇలా అనుకున్నాడు: "నేను ఈ హనుమంతుడికి సహాయం చెయ్యాలి. ఇతను ఇక్ష్వాకు కులానికి చెందిన రాముడి నిమిత్తం వెళుతున్నాడు. నన్ను ఉద్ధరించిన సగరుడు ఇక్ష్వాకు కులం వాడేగద! అయన పేరనే నాకు సాగరం అన్నమాట వచ్చింది గద! అందుచేత ఈ హనుమంతుడికి లంకకు పోయే మధ్య దారిలో కొంత విశ్రాంతి కలగజేస్తాను."

ఇలా చెప్పి హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరాడు. అతనితోబాటు అనేక చెట్లు కూడా లేచాయి. అతని శరీరం నిండానూ, సముద్రం నిండానూ పూలు రాలాయి. చాచిన హనుమంతుడి చేతులు అయిదు తలల పాముల్లాగా ఉన్నాయి. అతని కళ్ళు సూర్యచంద్రులు ఒకేసారి ఉదయించినట్లుగా ఉన్నాయి. అతని తోక నిటారుగా పైకి లేచి ఉన్నది.

హనుమంతుడు అతివేగంగా పోతూంటే అతని చేతుల కిందుగా గాలి చేసే ధ్వని మేఘగర్జనలాగా ఉన్నది. అతను లంకకు చేటు కలిగించే తోకచుక్క లాగా ఉన్నాడు. అతని నీడ సముద్రం మీద

ఇలా అనుకుని సముద్రుడు మైనాకుడనే పర్వతంతో, "మైనాకుడా, నిన్ను ఇంద్రుడు పాతాళంలోని రాక్షసులు పైకి రాకుండా మూసి ఉంచమని ఆదేశించాడు గదా! నువ్విప్పుడు నీటి అడుగు నుంచి పైకి పెరగాలి. హనుమంతుడు నువ్వుండే దారి మీదుగా ఎగిరిపోతున్నాడు. అతను నిన్ను దాటి ముందుకు వెళ్లిపోక మునుపే, నీ బంగారు శిఖరాలను నీటి పైకి పెంచి, వాటి పైన హనుమంతుడు విశ్రమించే సదుపాయం చెయ్యి," అన్నాడు.

వెంటనే మైనాకపర్వతం నీటి పైకి పెరిగింది. అది చూడటానికి, తూర్పు సముద్రంలో నుంచి పైకి లేచే సూర్యుడు లాగా

ఉన్నది. ఆ పర్వతం తన దారికి అడ్డంగా పైకి పెరగటం చూసి, హనుమంతుడు తనకు ఆ పర్వతం విఘ్నం కలిగించ జూస్తున్నదనుకున్నాడు. ఈ అపోహ తో హనుమంతుడు గట్టిగా హుంకరించి ఆ పర్వత శిఖరాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసి, పడగొట్టాడు.

అంతులేని హనుమంతుడి బలం చూసి మైనాకుడు పరవశుడై, మానవ రూపంలో పర్వత శిఖరాన ప్రత్యక్షమై, "హనుమంతుడా! నీ బలం ఎలాటిదని చెప్పాలి? ఏ ప్రాణికీ సాధ్యంకాని విధంగా సముద్రాన్ని లంఘిస్తూ కూడా, ఏ మాత్రమూ అలసట చెందకుండా, నీ బలంతో నన్ను పడదోయగలిగావే! కొంచెంసేపు ఈ శిఖరం మీద విశ్రాంతి తీసుకో! సముద్రుడు, రాముడికి పూర్వపురుషుడైన సగరుడి వల్లా, అతని కొడుకులవల్లా చాలా మేలు పొందాడు. ఆ కారణంగా సముద్రుడు, రామకార్యం మీద పోతున్న నీకు, తగిన సత్కారం చేసి, సగరవంశానికి కృతజ్ఞత చూపగోరుతున్నాడు. అందుచేత నువ్వు ఇక్కడ కొంచెంసేపు విశ్రమించి నీ దారిన వెళ్ళు." అన్నాడు.

మైనాకుడు హనుమంతుడితో ఇంకా ఇలా అన్నాడు:

"వాయుదేవుడి కుమారుడిగా కూడా నేను నిన్ను పూజించవలసి ఉన్నది. దానికి కారణం ఉన్నది. కృతయుగంలో పర్వతాలకు రెక్కలుండేవి. అవి గాలిలో తిరిగేటప్పుడు కిందపడతాయేమోనని దేవతలూ, ఋషులూ భయపడేవారు. అది తెలిసి దేవేంద్రుడు తన వజ్రాయుధంతో అనేకవేల పర్వతాల రెక్కలను ఖండించాడు. అతను నా రెక్కలను ఖండించటానికి వస్తూండగా వాయుదేవుడు చూసి, నన్ను కాపాడటానికి దూరంగా నెట్టుకుపోయి, సముద్రంలో పడేశాడు. ఆ విధంగా నేను వాయుదేవుడికి ఋణపడి ఉన్నాను. కనక, నువ్వు నా ఆతిథ్యం స్వీకరించు. నిన్ను చూడటం నాకు ఎంతో ఆనందంగా ఉన్నది."





# శివయ్య పుణ్యం

36

వేములపల్లె అనే గ్రామంలో వుండే కొమరయ్య, కొబ్బరికాయల వ్యాపారి. అతడికి ఈ మధ్యనే పెళ్ళయింది. భార్య పేరు కోమలి. పేదఇంటి పిల్ల.

కోమలి కాపరానికివచ్చిన మర్నాడు భర్తతో, "మీరు సాయంత్రం త్వరగా వస్తే, కోవెలకు వెళదాం," అన్నది.

ఆ మాట వింటూనే కొమరయ్య కోపంగా, "అప్పుడే నా రాకపోకలు శాసించేదానవయ్యావా? నాకు తోచినప్పుడు ఇంటికివస్తాను, తోచినప్పుడు వెళతాను— తోచినట్లు చేస్తాను. వేళకింత ఉడకేసి పెట్టడం, ఒళ్ళు దగ్గిరపెట్టుకుని ఇంటి పని చేసుకోవడం, అంతవరకే నీ హద్దు. తెలిసిందా?" అంటూ విసురుగా వీధిలోకి వెళ్ళిపోయాడు.

కోమలి నిర్ఘాంతపోయింది. ఆమెకు తను చేసిన తప్పేమిటో తెలియలేదు. ఆ రోజంతా భోజనంమాని, కళ్ళ నీరు కారుస్తూ కూర్చున్నది.

ఒక పక్షం రోజులు తిరిగేసరికి, ఆమెకు భర్త మనస్తత్వం అర్థమైంది. చాలా కరుకుగా మాట్లాడుతూ, ఇంట్లో క్రమశిక్షణ వుండేలా చూడాలన్నది, అతడి అభిప్రాయం. భార్యతో ఎక్కువగా మాట్లాడినా, ప్రేమచూపినా నెత్తికెక్కుతుందని, అతడి భయం. అతడు అనుకున్నది జరిగిపోవాలి. ఎదటివాళ్ళు ఎట్టి పరిస్థితుల్లోనూ నోరెత్తకూడదు.

ఒకనాడు చీకటిపడుతూండగా పరశురామయ్య, వాళ్ళింటికి వచ్చాడు. ఆయన గ్రామం పొలిమేర అవతల, పట్టణానికి దాపులనున్న కొండమీది శివాలయంలో పూజారి. కోమలి తండ్రికి చిన్ననాటి మిత్రుడు. భార్య అనారోగ్యంవల్ల కోమలి పెళ్ళికి రాలేకపోయాడు. ఏదో పనిమీద

మాచిరాజు కామేశ్వరరావు




తూంటే, నేను వంట పూర్తి చేస్తాను,'' అన్నది.

''అడ్డమైన వాళ్ళందరితో మాట్లాడే తీరిక నాకు లేదు. పైగా ఇక్కడ వ్యాపారంలో పోటీ పెరిగిపోయి నష్టాల్లో వున్నాం. నువ్వు దారేపోయే దానయ్య లందరికీ, అపర అన్నపూర్ణలా వండి వడ్డిస్తానంటే, పళ్ళు రాలగొడతాను!'' అని గట్టిగా అరిచాడు కొమరయ్య.

ఆ మాటలకు కోమలి విలవిల్లాడిపోయింది. కొత్తగా పెళ్ళయిన తనతో భర్త ఇలా మాట్లాడుతూంటే, బాబాయి ఏమనుకుంటాడు? తండ్రికి ఈ సంగతి తెలిస్తే ఎంత బాధపడిపోతాడు!

ఆమె చిన్నగొంతుతో, ''కాస్త మెల్లిగా మాట్లాడండి!'' అన్నది భర్తతో.

కొమరయ్య చిరాకుపడిపోతూ, ''ఇక నోరుముయ్యి! పెళ్ళానికి అలుసిస్తే, ఇల్లు వల్లకాడవుతుంది,'' అన్నాడు మరింత పెద్దగా.

''నేను వెళుతున్నాను, తల్లీ! తలుపు వేసుకో,'' అని ముందు గదిలోంచి కేక పెట్టాడు, భార్యాభర్తల సంభాషణ అంతా విన్న పరశురామయ్య.

కోమలి, పరశురామయ్య దగ్గిరకు వచ్చి, ''ఇక్కడ చూసింది, విన్నదీ ఇక్కడే మరిచిపో, బాబాయ్! మా ఇంట్లో

గ్రామానికి వచ్చిన పరశురామయ్య, కొత్త దంపతుల్ని ఆశీర్వదించిపోదామని వాళ్ళింటికి రావడం జరిగింది.

ఒంటరిగా కుమిలిపోతున్న కోమలికి, ఆయనను చూడగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఆమె ఎంతో అప్యాయంగా, ''కూర్చో బాబాయ్! ఇప్పుడు పిన్ని కులాసాయే గదా?'' అని అడిగింది చిన్నగా నవ్వుతూ.

తర్వాత ఆమె, పరశురామయ్యకు మంచినీరిచ్చి, లోపలిగదిలో ఏవో లెక్కలు చూసుకుంటున్న భర్తతో, ''మా నాన్నగారి చిన్నప్పటి మిత్రుడు పరశురామయ్య బాబాయివచ్చాడు. మీరాయనతో మాట్లాడు

పొరబాటున కూడా నోరు జారవద్దు.'' అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

''బాధపడకమ్మా. ఆ శివుడే నీ కష్టాలు తీరుస్తాడు!'' అంటూ వెళ్ళిపోయాడు పరశురామయ్య.

నెల రోజుల తర్వాత ఒకనాడు పరశురామయ్య, కొమరయ్య ఇంటికి వచ్చాడు. కొమరయ్య ఆయన్ని చూస్తూనే, ''మిమ్మల్ని లోగడ చూశాను. మీరు పూజారి పరశురామయ్యగారు కదా?'' అన్నాడు.

''అవును, బాబూ. మా శివాలయం ఆవరణలో, కొత్తగా కొబ్బరికాయల అంగడి పెడుతున్నారు. ప్రహరీ వెనక కాపురం వుండడానికి చిన్న ఇల్లు కూడా వున్నది. ఎలా లేదన్నా రోజుకు యాభై కొబ్బరికాయలు అమ్ముడుపోతాయి. పువ్వులూ, ఊదొత్తులూ కూడా అంగడిలో పెడితే, మరికొంత లాభసాటిగా వుంటుంది. నువ్వు ఒకసారి వచ్చి చూసుకోవడం మంచిది.'' అన్నాడు పరశురామయ్య.

కొమరయ్యకు ఇది మంచి అవకాశంగా తోచింది. అతడు పక్క గదిలో వున్న కోమలిని కేకవేసి పిలిచి, సంగతి చెప్పి, పరశురామయ్యతో బయలుదేరాడు. వాళ్ళు శివాలయం చేరేసరికి చీకటి పడబోతున్నది.



కొమరయ్యకు కొత్త అంగడి, ఇల్లూ బాగా నచ్చాయి. పరశురామయ్య, ధర్మకర్తకు నచ్చజెప్పడంతో, వందరూపాయిల బాడుగ తీసుకునేందుకు ధర్మకర్త అంగీకరించాడు.

ఇద్దరూ ఆలయం నుంచి బయిటికి వచ్చాక, పరశురామయ్య, కొమరయ్యతో, ''నువ్వు ఈ రాత్రికి మా ఇంట్లోనే వుండి, తెల్లవారి వెళుదువుగాని. శివరాత్రి ఉత్సవాల ఏర్పాట్ల గురించి నేను, ధర్మకర్త గారితో మాట్లాడి కొంచెం ఆలస్యంగా ఇంటికి వస్తాను. ఇల్లు కనుక్కోవడం చాలా తేలిక. కొండ దిగగానే రెండు దారులుంటాయి. ఎడంవైపు దారిలో రావి



చెట్టుకు ఎదురుగా వున్న ఇల్లే, మనది!'' అన్నాడు.

కొమరయ్య కొండ దిగేసరికి బాగా పొద్దు పోయింది. అనుకోకుండా పెద్ద పెట్టున వర్షం ప్రారంభమైంది. అతడు ఎడంవైపు దారిలో, రావిచెట్టుకు ఎదురుగా వున్న పాత పెంకుటిల్లు చేరేసరికి, వర్ష తీవ్రత మరింతగా పెరిగింది.

కొమరయ్య నాలుగైదుసార్లు తలుపు తట్టాక, ఒక ముసలాయన చిన్న దీపం పట్టుకుని తలుపుతెరిచి, ''ఎవరికోసం వచ్చారు?'' అని అడిగాడు.

''పూజారి పరశురామయ్యగారి ఇల్లు ఇదేనా?'' అని అడిగాడు కొమరయ్య.

''ఆయన ఇల్లు పక్కవీధిలో. వర్షంలో బాగా తడిసినట్టున్నావు, లోపలికి రా!'' అన్నాడు ముసలాయన.

కొమరయ్య లోపలికి వెళ్ళాడు. హఠాత్తుగా అతడికొక ఆలోచన వచ్చింది. మొదటిసారి పరశురామయ్య తన ఇంటికి వచ్చినప్పుడు, ఆయనకు తనెలాంటి మర్యాదలూ చెయ్యలేదు! అలాంటిది, ఇప్పుడాయన ఇంటికి వెళ్ళి అతిథి మర్యాదలు పొందడం సిగ్గుచేటుకాదా!

ఈ ఆలోచన రాగానే కొమరయ్య, ముసలాయనతో, ''ఈ వానలో నేను పరశురామయ్యగారింటికి వెళ్ళలేను. ఈ రాత్రి ఇక్కడే గడిపేస్తాను. మీకేం అభ్యంతరం లేదు కదా!'' అన్నాడు.

''నాకెలాంటి అభ్యంతరమూ లేదు. అదుగో, ఆ గోడవారగా వున్న మంచంలో నువ్వు పడుకో. ఈ పడకకుర్చీ నాకు చాలు. అంతా విధివైపరీత్యం, బాబూ! ఆరుగురు కొడుకులున్న అనాథను, నేను,'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

అర్ధరాత్రివరకూ ముసలాయన, తన దీనస్థితి గురించి కొమరయ్యకు చెప్పుకున్నాడు: వయసులో వుండగా, ఆయన చాలా కోపిష్ఠి. భార్యాపిల్లలపట్ల ఎంతో కఠినంగా ప్రవర్తించేవాడు. ఇదంతా



అయన దృష్టిలో క్రమశిక్షణ! ఎవరినీ ఆయన ఆప్యాయంగా పలకరించేవాడు కాదు. పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయి, ఏవేవో ఉద్యోగాలు సంపాయించుకుని, తలా ఒక ప్రాంతానికి వెళ్ళిపోయారు. వాళ్ళల్లో ఏ ఒక్కరికీ తండ్రి అంటే ప్రేమ లేదు. తల్లి పోగానే, వాళ్ళు ఆ ఇంటితో దాదాపు తెగతెంపులు చేసుకున్నారు.

''ఇదంతా, నా చేతులారా చేసుకున్నదే, బాబూ! మనం తాలికట్టిన భార్యనూ, కన్నబిడ్డలనూ ప్రేమగా చూడనప్పుడు, వాళ్ళు మనను ప్రేమతో ఆదరించాలనుకోవడం, కేవలం భ్రమ అవుతుంది!'' అన్నాడు ముసలాయన కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ.

ఇది విన్న కొమరయ్య మనసు వికలం అయి, ఎప్పటికో తెల్లవారుజామున చిన్న కునుకు పట్టింది. ఆ తర్వాత ఎవరో గట్టిగా వీపుతట్టి పిలుస్తూంటే, అతడికి మెలుకువ వచ్చింది. అసరికి బాగా తెల్లవారి పోయింది.

కొమరయ్య నిద్ర మేలుకుని దిక్కులు చూసేంతలో, పరశురామయ్య, ''బాబూ, రాత్రి నువ్వు తలదాచుకోవడానికి, ఈ దయ్యాలకొంపే దొరికిందా? నేను పొరబాటున మన ఇంటికి కుడివైపు దారి అని చెప్పడానికి బదులు, ఎడమవైపు దారి అని చెప్పినట్టున్నాను. రాత్రి వర్షంలో నిన్ను వెతకలేక, తెల్లవారుతూనే బయలుదేరాను,'' అన్నాడు.

దయ్యాలకొంప అన్న మాట విని, కొమరయ్య నిర్ఘాంతపోతూ, ''ఏమిటీ! దయ్యాలకొంపా! ఈ ఇంట్లో నాకు దయ్యాలేమీ కనిపించలేదు. రాత్రి ఒక ముసలాయన నాకు ఆశ్రయం ఇచ్చాడు,'' అన్నాడు.

''ఆయన సన్నగా, పొడుగ్గా వుంటాడు, అవునా? కుడి కంటికింద నల్లటి పులిపిరికాయ వున్నది, అంతేనా?'' అని అడిగాడు పరశురామయ్య.

"అవును, ఆయనే!" అన్నాడు కొమరయ్య.

"ఆయన ఈ లోకం వదిలి దాదాపు పదేళ్ళయింది! ముసలితనంలో మంచం పట్టి, దగ్గరుండి సాయం చేసేవాళ్ళెవరూ లేక నరకయాతనలనుభవించాడు. ఆ శిక్ష చాలదన్నట్టు ఇప్పుడు దయ్యమయి, ఈ ఇంటినే అంటిపెట్టుకుని వుంటున్నాడు. ఈ సంగతి చాలామంది చెప్పినా, నేను నమ్మలేదు సుమా!" అన్నాడు పరశురామయ్య.

రాత్రంతా తానొక దయ్యంతో గడిపానన్న సంగతి విని, కొమరయ్య నిలువెల్లా వణికిపోయాడు.

ఆ తర్వాత వారం తిరక్కుండానే కొమరయ్య, కోమలితో సహా కాపరాన్ని కొత్త ఇంటికి మార్చాడు. కోమలికి ఇప్పుడు ఎంతో ఆనందంగా వున్నది. శివాలయం దగ్గిరకి కాపరానికి వచ్చాక, కొమరయ్య ఎంతగానో మారి పోయాడు. మునుపటిలా కసురుకోవడం, కోపం—అంతా మంత్రం వేసినట్టుగా మాయమయినై.

ఒకనాడు శివాలయంలోకి వచ్చిన కోమలిని, పరశురామయ్య, "ఇప్పుడు సంతోషంగా వున్నావా, తల్లీ? మీ ఆయన నిన్ను బాగా ఆదరిస్తున్నాడా?" అని అడిగాడు.

"అంతా శివయ్య పుణ్యం, బాబాయ్!" అన్నది కోమలి చిరునవ్వునవ్వుతూ.

పరశురామయ్య ఉలిక్కిపడి, "నీకు శివయ్య తెలుసా?" అని అడిగాడు.

"శివయ్యను ఎరగనివాళ్ళుంటారా, బాబాయ్?" అన్నది కోమలి, గర్భగుడిలోని శివలింగాన్ని చూపిస్తూ.

"ఆ మాట నిజం తల్లీ!" అన్నాడు పరశురామయ్య తేలిగ్గా నిట్టూర్చి, అంతా శివయ్య పుణ్యం అనుకుంటూ.

కొమరయ్యలో మార్పు తీసుకురావడానికి, తను పొరుగూరి శివయ్యతో దయ్యం నాటకం ఆడించినట్టుగా, పరశురామయ్య, ఏనాడూ కోమలితో చెప్పలేదు.





# పీడకల

పూర్వం బర్మాదేశంలోని, ఒక గ్రామంలో బామాంగ్ అనే వడ్డీ వ్యాపారి వుండేవాడు. అతడికి ధనసంపాదన పట్ల తప్ప, మరే ధర్మకార్యాల విషయంలోనూ ఆసక్తి వుండేదికాదు. అతడి కొకసారి జబ్బుచేసి, ఇక బతకనేమో అన్నభయంపట్టుకున్నది. చనిపోయే ముందయినా దేవుణ్ణి గురించీ, భక్తుల గురించీ ఏవైనా కథలు విందామన్న ఆలోచన కలిగింది, బామాంగ్‌కు.

ఆయన తన సేవకుణ్ణి పిలిచి సంగతి చెప్పి, గుడి పూజారిని పిలుచుకు రమ్మన్నాడు. గుడి పూజారి వచ్చి అతణ్ణి, "నువ్వు దేవాలయానికొచ్చి ఎంతకాలమైంది." అని ప్రశ్నించాడు.

"స్వామీ, సరిగా గుర్తులేదు," అన్నాడు వడ్డీవ్యాపారి.

"నీకీనాటివరకూ దేవుడిపట్ల భక్తిభావం లేదు. ఈ ఆఖరిక్షణంలో నువ్వు దైవ లీలలను గురించీ, భక్తులను గురించీ వినడంవల్ల ప్రయోజనం ఏమీవుండదు!" అంటూ వెళ్ళిపోయాడు పూజారి.

మంచి వైద్యుల సాయంతో, కొన్నాళ్లకు వడ్డీవ్యాపారి జబ్బు నుంచి బయటపడి, ఎప్పటిలా తిరగసాగాడు.

ఒకనాడు వీధిలో ఎదురైన అతణ్ణి చూసి పూజారి ఆశ్చర్యంగా, "ఏమిటీ, నువ్వు అంత జబ్బు నుంచీ బతికి బయటపడ్డావన్నమాట!" అన్నాడు.

"అవును స్వామీ! జబ్బయితే నయమైంది కాని, ఒక పీడకల మాత్రం పట్టి వేధిస్తున్నది," అన్నాడు వడ్డీవ్యాపారి.

"పీడకలా! ఏమిటది?" అని అడిగాడు పూజారి కుతూహలంగా.

"ఆ కలలో నేను చచ్చి స్వర్గానికి పోయాను. అయితే అక్కడ వున్న ద్వారపాలకుడు నన్ను అడ్డుకుని, 'నువ్వే

బర్మా జానపద కథ

నాడైనా పూజారులూ, సన్యాసులూ చెప్పిన పుణ్యకథలేమైనా విన్నావా?' అని అడిగాడు. నేను వినలేదన్నాను. నా జవాబుకు ద్వారపాలకుడు విసుక్కుని, 'అయితే, ఇక్కడే వుండు. స్వర్గంలో వున్న అలాంటి వారి నెవరినైనా తీసుకువస్తాను. వారు దీవించిన తర్వాతే, నీకు స్వర్గద్వారాలు దాటే అర్హత కలుగుతుంది,' అన్నాడు.

కొంతసేపటికి ద్వారపాలకుడు తిరిగి వచ్చి, 'నువ్వు దురదృష్టవంతుడివి! స్వర్గంలో పూజారులూ, సన్యాసులూ ఎవరూ లేరు,' అని చెప్పాడు,'' అన్నాడు వడ్డీవ్యాపారి. అది విని, పూజారి కోపంతో వెళ్ళిపోయాడు.

కొద్ది రోజుల తర్వాత గ్రామాధికారికి, వడ్డీవ్యాపారి పీడకల గురించి తెలిసింది. అతడికి పూజారిపట్ల చాలా ద్వేషం. అందువల్ల, వడ్డీవ్యాపారిని పిలిపించి, ''నీ పీడకల గురించి తెలిసింది. నీకు జబ్బుగా వున్నప్పుడు, అతడు దురుసుగా అన్న మాటలకు తగిన విధంగా బుద్ధి చెప్పావు. బావుంది! ఆ ఒక్క కలేనా, మరేమైనా పీడకలలు వస్తున్నవా?'' అని అడిగాడు.

''ఈమధ్య మరొక పీడకల వస్తున్నది!'' అన్నాడు వడ్డీవ్యాపారి.

''అలాగా! ఏమిటా పీడకల?'' అని అడిగాడు గ్రామాధికారి.

''ఆ మొదటి పీడకల ముగిశాక, నేను నరకానికి వెళ్ళాను. నేను నరకద్వారం సమీపిస్తున్నంతలో, తెరిచి వున్న ద్వారం అవతలి నుంచి పూజారులూ, సన్యాసులూ కీచులాడుకోవడం కనిపించింది. నేను బాగా అలిసిపోయి వున్నానేమో—ద్వారం పక్కనే వున్న ఒక ముక్కాలి పీట మీద కూర్చోబోయాను. అంతలో యమకింకరుడొకడు పరిగెత్తుకుంటూ వచ్చి, 'ఆ ముక్కాలిపీట నీకాదు; నీ గ్రామాధికారి కోసం!' అంటూ నన్ను దూరంగా విసిరి వేశాడు,'' అన్నాడు వడ్డీవ్యాపారి.

ఇది విని గ్రామాధికారి, వడ్డీవ్యాపారి కేసి ఒకసారి ఉరిమి చూసి, తల వంచుకుని వెళ్ళిపోయాడు.





# చిరజీవి

స్వర్గంలో దేవేంద్రుడికి ఆధిపత్యం రాగానే అన్ని లోకాలకూ ఆయన చేయవలసిన పనులు చేసి, చివరకు భూలోకంలోని ప్రజలకు ఎలా సౌఖ్యం చేకూర్చటమా? అని దీర్ఘంగా ఆలోచించాడు. ఆఖరికి ఏడు నక్షత్రాలను ఎదుటికి రమ్మని ఆజ్ఞాపించాడు.

చుక్కలు ఏడూ వచ్చి వరుసగా నిలబడి ప్రకాశించేసరికి, గొప్ప వెలుగు వెలిగింది. భూలోకంలో ప్రజలంతా తలలెత్తి ఆకాశం వైపు చూశారు.

చుక్కలు ఏడూ కలిసి ఏకకంఠంతో, "ఏమిటి సెలవు ప్రభూ?" అని అడిగాయి.

"భూలోక ప్రజలకు సౌఖ్యాన్ని సమకూర్చ దలిచాను. అయినా, ఊరక ఇస్తే ఏ వస్తువుకూ విలువ ఉండదు. కనుక, మీరు పోయి నేనిచ్చే వస్తువులను వాళ్ళకు సరైన ధరకు విక్రయించి రావాలి," అన్నాడు దేవేంద్రుడు.

"అలాగే ప్రభూ!" అన్నవి తీయని కంఠస్వరాలతో ఏడు చుక్కలూ.

ప్రకాశం కేసి ఆశ్చర్యంగా చూస్తూ వున్న భూలోక ప్రజలకు ఆకాశంలో అప్పుడు అమరగానం వినిపించింది.

మొదటి నక్షత్రానికి దేవేంద్రుడు ఒక బంగారపు భరిణె ఇచ్చి, "ఇది హాస్యరసం. ఇది సేవించినవాళ్ళకు సంతోషమిస్తుంది. సంతోషమే జీవికి బలం," అన్నాడు. రెండవ చుక్కకు ఒక భరిణె ఇచ్చి, "ఇది సౌశీల్యం ఇదే ప్రాణికి జీవం," అని చెప్పాడు. మూడవదానికీ ఒకటి ఇచ్చి, "ఇది ఆరోగ్యం. ఆరోగ్యమే మహాభాగ్యం," అన్నాడు. నాల్గవదానికి ఒక భరిణెనిచ్చి, "ఇదే చిరజీవత్వం. బ్రతికి బాగా వుంటేనే ఏ జీవియైనా పని

చేయగలిగేది." అని చెప్పాడు. ఐదవ చుక్కకు ఒక భరిణెనందించి, "ఇది కీర్తి. మానవునికి పేరూ ప్రతిష్ఠా కలిగిస్తుంది," అన్నాడు. ఆరవదానికి ఒక భరిణె ఇచ్చి, "ఇది ఆనందం. దీనికోసమే మహర్షులు కూడా తాపత్రయపడుతూ వుంటారు," అని చెప్పాడు. ఆఖరికి ఏడవ నక్షత్రానికి ఒక భరిణె ఇచ్చి, "ఇదే ఐశ్వర్యం. జీవితరథం సాగటానికి అగత్యమైన సాధనం," అని చెప్పాడు.

చుక్కలు ఏడూ సాధారణ స్త్రీ రూపాలతో భూలోకానికి దిగి వచ్చి భరిణెలలోని వస్తువులను అమ్మ జూశాయి. మొదటి మూడు చుక్కలు ఎంత తిరిగినా కొనే వాళ్ళు కరువయ్యారు.

నాలుగో చుక్క వీధులంట తిరుగుతూ, "దీర్ఘ జీవితం కావాలా! దీర్ఘ జీవితం!!" అంటూ అమ్మేసరికి ప్రజలు 'మాకు కావాలి' 'మాకు కావాలి' అంటూ ఎగబడ్డారు.

"నా అక్కచెల్లెళ్ళు విక్రయించే వస్తువులు కొన్నారా, మరి? పెద్దక్క దగ్గరి భరిణెలో హాస్యరసం, రెండవ అక్క దగ్గర సౌశీల్యం, మూడవ అక్క వద్ద ఆరోగ్యం వున్నై. ఐదవ చెల్లి కీర్తి, ఆరవది ఆనందం, ఏడవది ఐశ్వర్యం అమ్ముతున్నారు. అవి మీరు కొననేలేదా?" అని అడిగింది నాలుగోచుక్క. ప్రజలు 'లేదు, లేదు.' అన్నారు.

"అవి లేకుండా నా భరిణెలోని ఔషధం మీకు ఉపకరించదు. అవన్నీ ఉన్న వాళ్ళకే దీర్ఘజీవితం సార్థకమవుతుంది," అంటూ భరిణె మూత వేసేసింది నాలుగో చుక్క.

ఐతే, మచ్చుకోసమని చేతిలోకి తీసుకొని వున్న మందు మళ్ళీ భరిణెలో వేయటం ఇష్టం లేక అక్కడే ఒక చెట్టు కొమ్మ మీద ఒక రామచిలుక కనిపించేసరికి, నాలుగో చుక్క చిరునవ్వుతో దానిని చిలుక ముక్కుకు అందించింది. ఆ మచ్చు మందు తినడంవల్ల, ఆ రామచిలుక మూడువందల సంవత్సరాలు చిరజీవిగా బతకడానికి అది సరిపోయింది!




ఒకాపి
ఆఫ్రికాలోని కాంగో అరణ్యాలలో జిరాఫే జాతికి చెందిన ఒకాపి జాతి జంతువులు నివసిస్తున్నాయి. వాటి ఉనికి ఈ శతాబ్దారంభంలోనే కనుగొన్నారు.


విశాలమైన బురదనేల
ప్రపంచంలోకెల్లా అత్యంత విశాలమైన బురదనేల సోవియట్ రష్యాలోని ప్రిపెట్ నదీ తీరంలో ఉన్నది. దీని విస్తీర్ణం 18,125 చ.మైళ్ళు (46,950 చ.కి.మీ).


పరికరం ఉపయోగించే పిట్ట
పసిఫిక్ మహా సముద్రంలోని గాలాపగోస్ దీవులలో నివసించే ఒక రకం వడ్రంగి పిట్ట, పురుగులున్నాయా అని చెట్టు బెరడులను తట్టి చూడడానికి సన్నటి నాగుదాళి ముళ్ళను ఉపయోగిస్తాయి.

ఇదంతా మొటిమలపై మూడు రకాలుగా పనిచేసే క్లియరసిల్ విశిష్టత.



1 ఇది మొటిమల్లోకి చొచ్చుకుపోతుంది.



2 ఎక్కువైన జిడ్డును తొలగిస్తుంది.



3 దీంతో మొటిమలు ఎండిపోతాయి.

గొడవలేక తేలిపోయింది, మొటిమలను పోగొట్టడంలో క్లియరసిల్ ప్రపంచమంతటా నం. 1.

మరందుకే మొటిమలను మీ స్నేహాలదారికి అడ్డు రానివ్వకండి. క్లియరసిల్ తెచ్చుకోండి. మొటిమలను తరిమెయ్యండి అవతలకు.

మొటిమలను పోగొట్టడానికి ఇంతకన్నా మంచి మార్గం లేదు.




మొటిమలను పోగొట్టడంలో క్లియరసిల్ ప్రపంచమంతటా నం.1.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 మే నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Anant Desai

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కర్తవ్యం! — రెండవ ఫోటో : నైపుణ్యం!

పంపినవారు : కె. యం. రమేష్, భీమనవారిపేట, విజయవాడ—520 009.

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# క్యాండీ బేర్ సాహసాలు

## తేనెపట్టుపై దాడి



మధురమైన ఒక సుందర దినాన్న మ్యాజిక్ అడవిలో క్యాండీ బేర్‌కు కరకరా ఆకలివేసింది.



"ఏదైనా స్వీట్ తినాలన్న కోరిక కల్గింది నాలో"...



ఇంతలోనే ఒక తేనెపట్టు కంటపడింది. అది చూసి నవ్వుకొని, ఇప్పుడే తేనెపట్టును దులుపుకొని కడుపునిండా తేనెను ఆరగించవచ్చులే అని అనుకుంది.



కానీ, తను ఆ పని మొదలెట్టకముందే... తేనెపట్టుకు పట్టిన తేనెటీగలు దీన్ని చుట్టుముట్టాయి.



పాపం, ఆ చిన్న క్యాండీ బేర్ చుట్టూ తేనెటీగలు ముసురుకొని కుట్టడం మొదలెట్టాయి. దాంతో "అమ్మో, అమ్మో", "రక్షించండి, రక్షించండి" అని ఏడుస్తూ పరుగులంకించుకుంది.



తన స్నేహితుడు పిగ్గీ దీని కేకలు విని ఏమయింది క్యాండీ బేర్? అని అడిగింది. క్యాండీ బేర్ ఈ గోడు అంతా వినిపించింది. అందుకు పిగ్గీ, "నీవెంత తెలివి తక్కువ దానవు క్యాండీ బేర్! తేనెనెందుకు దొంగిలించడం, నా దగ్గరున్న వీటిలో కొన్ని తీసుకొని నీవు తినవచ్చుకదా...



**Kwality**

క్యాండీలు మరియు టాఫీలు

అబ్బ, ఇవి నోరూరించే రుచిగలవే!

